# శశాంక రేఖలు

## (రేఖా చిత్రాలు)



1990

బెజవాడ గోపాలరెడ్డి

# SASAANKA REEKHALU
(A collection of Sketches) by
**Dr. Bezawada Gopala Reddi**



ప్రథమ ముద్రణ : 1990

ముఖచిత్రం : అమర్



వెల రూ. 10/-

ప్రతులకు :

ఆంధ్ర సారస్వత పరిషత్తు,
తిలక్ రోడ్, హైదరాబాదు-1

ముద్రణ :

శివాజీ ప్రెస్
4-4-583, గంజ్ బజారు
సికింద్రాబాద్-500 003.

# గ్రంథకర్త జీవన వివరాలు

జననము : 5 ఆగస్టు, 1907
బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా.
తండ్రి-పట్టాభిరామిరెడ్డి
తల్లి-సీతమ్మ

చదువు : బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు
ఆంధ్ర జాతీయ కళాశాల
(1921-24), బందరు
విశ్వభారతి, శాంతినికేతన్
(1924-27)

సమర పర్వము : సర్కారుబడి వదులుట-జనవరి 1921
జైలు శిక్షలు-ఆరు మారులు
1930, 31, 32, 33 లోను
1940, 41, 42, 43 లోను
కొంతకాలం జైలులో ఉండినారు, దాదాపు
4 సం॥లు జైలులో మకాం. ఎ.బి.సి. క్లాసుల
ఖైదీగా, డెటెన్యూగా.

ఉద్యోగ పర్వము : మద్రాసులో 86 మాసాలు
కర్నూలులో 19 మాసాలు
(ఆంధ్ర ముఖ్యమంత్రిగా)
హైదరాబాదులో 16 మాసాలు
(ఆంధ్రప్రదేశ్ మంత్రిగా)
కేంద్రమంత్రిగా 66 మాసాలు
ఉత్తర్‌ప్రదేశ్‌లో గవర్నరుగా 62 మాసాలు
ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రో-ఛాన్సలర్‌గా-
జూన్ 1951 నుండి 72 మాసాలు

సాహిత్య పర్వము : తెలుగు భాషాసమితి అధ్యక్షత 1948-86 వరకు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షత—
ఆగస్టు 57 నుండి డిసెంబరు 1982 వరకు
కేంద్ర సాహిత్య అకాడమీ కార్యవర్గం (రెండవ తూరి)
జనవరి 78-జనవరి 88
జ్ఞానపీఠ సలహా సంఘం 1963-71

# బెజవాడ గోపాలరెడ్డి పుస్తకాలు

ముక్తకాలు

1. ఆమె (1978)
2. ఆమె జాడలు (1981)
3. ఆమె నీడలు (1981)
4. ఆమె తళుకులు (1982)
5. ఆమె చెణుకులు (1983)
6. స్ఫులింగాలు-తుషారాలు (1984)
7. స్వప్న హారము
   పీఠికలతో సహా (1986)
8. దీపికలు (1988)
9. కళికలు (1889)

దీర్ఘ కవితలు

1. కాల వాహిని (1979)
2. సాహిత్య సుందరి 80)
3. ప్రసూన మంజరి (81)
4. పరిమళ తరంగాలు (82)
5. సాగర సమీరాలు (83)
6. మలయ మారుతాలు (85)
7. సౌరభ నీరాజనాలు (87)

రేఖాచిత్రాలు

1. శశాంక రేఖలు

అనువాదాలు :

1. గాలిబ్ ప్రేమ శతకము
   ఇక్బాల్ ఆత్మ శతకము (1989)
2. అల్లామ ఇక్బాల్ కవితలు (1989)
3. ఫిర్యాదు - జవాబు (ఇక్బాల్) 1989

రానున్నవి

1. గులాబి రేకులు
2. హంస తూలికలు

# అంకితము

మా రెండవ కుమారుడు

చి॥ రాధాకృష్ణకు

జననం,— 24.11.1951 మద్రాసులో 1986 ఆగష్టు 31 ఉదయం అదృశ్యమైనాడు. మళ్ళీ వార్త లేదు.

కోపముతో పోలేదు. సంతోషముగనే ఇంటినుండి పోయి కనిపించుట లేదు. కొంత మానసిక మాంద్య ముండినది.

హిందీ, తెలుగు చదివేవాడు. పురాణా లంటే యిష్టం. నా సందేహాలు తీర్చేవాడు. మంచివాడు.

కాశీ, హరిద్వార్, హృషికేశ్ ఆశ్రమములలో, బొంబాయి నగరములో వెదికించినాము. ఆచూకీ దొరకలేదు. అవివాహితుడు.

ప్రేమతో అంకితము

23-4-90 బెజవాడ గోపాలరెడ్డి

నెల్లూరు-3 లక్ష్మీకాంతమ్మ

# నివేదన

నా సొంత రచనలలో ముక్తకాలు దీర్ఘకవితలు వ్రాస్తూ వచ్చాను. ఆ దానికన్న ఎక్కువగనే వ్రాసినానని తృప్తిపడ్డాను.

ముక్తకాలు రెండు వేలకు పైగా సాగినవి. 'ఆమె' మొదలు ' వరకు 10 పుస్తకాలు 9 సంపుటాలుగా ప్రచురింపబడినవి. దీర్ఘకవిత పైగా మించి ఏడు సంపుటా లాయెను. 'కాలవాహిని' మొదలు 'సౌరభ జనాల' వరకు.

ముక్తకాలు కుదింపులు. చిన్నబొమ్మలు (miniature pai కన్ను, ముక్కు, వస్త్రాలు, ఆభరణాలు, రంగులు అన్నీ వానిలో కావాలి. దీర్ఘకవితలు పెద్దబొమ్మలు, విపులముగ, సరళముగ వ్యక్త రంగులు, ముఖాలు, దేహాలు, నగలు, ఇతర సామగ్రిని చూపేవి.

రెండూ ప్రక్కనే నడిచాయి. 16 సంపుటా లయ్యాక, తృప్తితో బడలిక ఏర్పడినది. 86వ సంవత్సరంలో మనస్సు కొంత విశ్రాంతి సమయములో రేఖాచిత్రాలను ప్రారంభించాను. ఏదో ఒక ఉదంతము ననో అల్లుకొని తేలికయైన తీగను రచించాలని యత్నించాను. ఇవి క కావు. వ్యాసాలు కావు. ముఖరేఖలు (outlines) మాత్రమే. 86-87 రములలో నా మనస్సు ఎగురుచుండిన తీరును చూపేవి. తేలికయైన గాలిపటాల ఎగురవేతలు, నిరుద్దేశ భావ విహారాలు, సంఘటన వర్ణనలు. శశాంక రేఖలను ప్రచురించుచున్నాను. శుక్లపక్ష శశాంకరేఖలు నన్ను పరచును. భావిపౌర్ణమిని దాచుకొని, దినదినము పెరిగి వికసించేవి. అ యైన భూతకాలానికి భవిష్యత్తు శుక్లశశాంకరేఖలు. సహృదయులు ఆ గలరని ఆశించుచున్నాను.

1989వ సంవత్సరంలో నావి నాలుగు ప్రచురణలు వెలికివచ్చాయి విశ్వవిద్యాలయంలోని శ్రీ యార్లగడ్డ ఆంజనేయుల నేతృత్వములో నా ప్ర

సాగుచున్నవి. అందులో నా ముక్తకములు ఆఖరి సంపుటము కళికలతో ప్రారంభమై, మూడు ఉర్దూ అనువాదాలు బయటికి వచ్చాయి. 1. గాలిబ్-ప్రేమశతకము—ఇక్బాల్ – ఆత్మశతకము, 2. అల్లామ ఇక్బాల్ కవితలు, 3. ఇక్బాల్ ఫిర్యాదు-జవాబు (షిక్వా-జవాబెషిక్వా). వీనితో నా ఉర్దూ అనువాదాలు పూర్తి అయినాయి. గాలిబ్ అంటే నాకు అభిమానము. ఇక్బాల్ అంటే నాకు ఆదరము. గాలిబ్ శతవర్ధంతి ఉత్సవముల కాలములో నేను ఉత్తర ప్రదేశ్‌లో గవర్నర్‌గా ఉన్నాను. ఎన్నో ఉత్సవములలో పాల్గొన్నాను. గాలిబ్ ఆగ్రాలో జన్మించినాడు, ఢిల్లీలో నివసించినాడు.

2వ అనువాద పుస్తకము అల్లామ ఇక్బాల్ కవితలు. నెహ్రూ శతజయంతి సంవత్సరములో జవ్హార్‌లాల్‌కు అంకితము. గాంధీజీ పుట్టినదినము (2-10-89)న నేను హైదరాబాదు రాజ్‌భవన్‌లో మకాం. శ్రీ కుముద్‌బేన్‌జోషి గాంధీజీ ప్రార్థనల జరిపించారు. తర్వాత నా గదిలో మిత్రుల సమావేశము. పదిమందికి మించి లేరు, ఉపన్యాసాలు లేవు. నా కోరిక ప్రకారము శ్రీమతి సి. వేదవతి ఆవిష్కరణోత్సవము చేశారు. శ్రీకృష్ణరావు వేదవతిగారలే పువ్వులు తెచ్చారు. మిఠాయి పంచిపెట్టారు. నా స్నేహితులు ప్రసాదరావు, డా. భరద్వాజ, శ్రీనివాసాచార్య, ఆంజనేయులు హాజరై యుండినారు. మహాత్ముని జన్మదినము, నెహ్రూకు అంకితమైన పుస్తకము, ఇక్బాల్ కవితలు, రాజభవన్‌లో స్నేహితుల సమక్షములో శ్రీమతి వేదవతి ఆవిష్కరణ! అన్నీ అలరించే సన్నివేశాలు, అందరికీ కృతజ్ఞతలు. ముఖ్యముగ వేదవతికి.

చివరి పుస్తకము- 'ఫిర్యాదు-జవాబు' అంకితము డా॥ దాశరథికి. వారిపై ఆదరమున్న శ్రీ ఎ. వి. కృష్ణారెడ్డిని కోరాను. సవేరా హోటల్ అధినేతను పుస్తకాన్ని అవిష్కరించమని. ఉపన్యాసాలులేని విందు సభలో. ఆశించిన దానికన్న ఉదారముగ, సవేరా హోటల్ ఆరుబయట డిసెంబరు 12 సాయంత్రము 50,60 మంది సాహితీవరుల సమక్షములో కృష్ణారెడ్డి పుస్తకాన్ని ఆవిష్కరించారు. వైభవముగ, మౌనంగ ఫలహారములు గైకొని ఆనందముగ మిత్రులు వెడలినారు. అందరికీ నమస్కారాలు. ముఖ్యముగ సవేరావారికి, సహృదయుడు వేంకటకృష్ణారెడ్డికి. ఇట్లా సాగింది నా 1989వ సంవత్సర సాహిత్యయాత్ర.

ఎంత నేర్పుగా ప్రూఫులు దిద్దినా, కొన్ని అచ్చు తప్పులు అనివార్యమగు

నేమో! మచ్చుకు- 57వ పేజిలో 3వ పంక్తిలో 'ఊరించుకొంటూ' అని చదవండి. 58వ పేజీలో 3వ పంక్తిలో 'ఖిన్న హృదయా'లని చదవండి. ఎక్కడో చకోరము అన్నచోట చకారము ఎగిరిపోయింది. కోరమని చదివితే అర్థముకాదు.

శశాంక రేఖలు చదవండి, చదివింపజేస్తే సహృదయులకు అభివాదములు.

శాంతినికేతనము
నెల్లూరు-3
23-4-1990

బెజవాడ గోపాలరెడ్డి

# రేఖా చిత్రాలు

# 1 జూలై 14

## 1

నలుబది తొమ్మిది సంవత్సరాలైనది,
ఈ తేదీనే మద్రాసు మంత్రి నయ్యాను.

ఉమ్మడి మద్రాసులో నాలుగు భాషల రాష్ట్రం. ఇచ్ఛాపురం నుండి ఉడిపి కుందాపురం వరకు. సూర్యోదయం, సూర్యాస్తమానం చూచే రాష్ట్రం.

స్వరాజ్యం రాలేదు. కేంద్రములో మంత్రులు లేరు. మరలా, రెండు స్వరాజ్య ప్రజోద్యమాలు, 1940లో యుద్ధ సహాయ నిరాకరణ. 1942 లో 'క్విట్ ఇండియా'. జైలు యాత్రలు. ఎంత చరిత్ర పరుగెత్తింది ? నాటినుండి నేటివరకు! నాటి గింజ నేడు చెట్టయినది

శతాబ్దాల మార్పులు ఈ కాలంలో కుదింప బడ్డాయి. బ్రిటిష్ పాలకులు పౌరాణిక పురుషు లయ్యారు. క్రొత్త శకారంభం, ప్రజా పరిపాలన. వేగు చుక్కలు క్రొత్త వెలుగుల చూపాయి. సత్యాగ్రహ వీరులు బ్రిటిష్ హయాములోనే పాలకులయారు. రాష్ట్రాలలో ఢిల్లీలో అధికారాలు తెల్లవారివే! వారిచేత నియమితులే అన్ని శాఖలూ నిర్వహించేవారు. దేశ విభజన కాలేదు. కరాచి, పెషావర్, లాహోర్, ఢాకా, చిట్టగాంగులు అప్పుడు మన దేశములోనివే !

ఆ వాతావరణములో ఆరు రాష్ట్రాలలో కాంగ్రెసు వారే మంత్రులయారు. బ్రిటిష్ వారే గవర్నర్లు. కీలక స్థానములలో జిల్లాలలో ఆంగ్లేయులే బాధ్యతల నిర్వహించారు. నాటి మంత్రులలో నేను చిన్నవాడను. నేడు సజీవులు నలుగురే! ముఖ్య మంత్రులందరూ మరణ గవాక్షముల గుండా నేటి దేశాన్ని చూస్తున్నారు. దక్షిణ ప్రాంతమున పాతకాలాలు నెమరు వేస్తూ నిలిచియున్నది నేనొక్కడినే! మారుచున్న కాలాలలో మారని మనిషిగా! కాల స్రవంతిలో నీరు పారుచనే యున్నది. నీటిని చూస్తూ, ఒడ్డున చెట్లు క్రొత్తవి మొలిచాయి. పాతవి మూడు నాలుగు, ముసలితనపు ముడతలలో ముడుచుకొని, పాత జ్ఞాపకాల సంచుల భుజాన తగిలించుకొని పండుటాకుల రాలుస్తూనే యున్నవి.

నేను ఆసించని వయస్సులో, ప్రయత్నము లేకనే స్థానిక పరిపాలన మంత్రిని అయాను. హేమాహేమీలు పంచాయతీ అధ్యక్షులు, జిల్లాబోర్డుల ప్రెసిడెంటులు, మునిసిపల్ చెయిర్మనులు- వారిపై నిఘా ఉంచాలిసిన మంత్రినయాను. పాలనానుభవము లేదు. క్రింది అధికారులు ఆంగ్లేయులే!

ఒక వైపు సంతోషము. ఒక వైపు సంకోచము. జైలుకు వెళ్ళిన ధైర్య కవచము ఉండనే ఉన్నది. ఆ సాహసమే పదవి సుడిగుండాలను ఎదుర్కొన్నది. పెద్ద తాకుడులకు తట్టుకొని, క్షతగాత్రుడను కాకుండానే బయట పడ్డాను. ముదిమి బాటలో, నిజ జీవితపు జాడలు చూస్తున్నాను. ఎన్ని ఎగుడు దిగుడులో! ఎన్ని వంకర టింకరలో! ఎంత దుమ్మో!

ఎన్ని పువ్వుల చెట్టుల సువాసనలో, ఎన్ని రమ్య

దృశ్యాలో, ఎన్ని అనుభవాలో, అనుభూతులో! ఏది ఎట్లున్నా, ముఖ్యమైన దినమే నా జీవితములో తొలి జైలు శిక్ష 1930లో!

ఎందరు అపరిచితులను పరిచయము చేసింది. ఎందరి చెలిమి హృదయాన్ని అలరించింది. ఎన్ని క్రొత్త ప్రదేశాలకు తీసికొని పోయింది? క్రొత్త వెలుగుల క్రొత్త తోటలలో విహరింప చేసింది? ఎందరి కవుల కళాకారుల పరిచయ సౌరభము గుండెను నింపింది? ఎన్నెన్ని క్రొత్త అనుభవాలు!

మంత్రి కావడ మెందులకు? జనుల శాసించుటకు కాదు, సేవించుటకు. వారికున్న ఇబ్బందులను వసతిని బట్టి తీర్చుటకు, సేవా వ్రతములో వికసించుటకు, నివసించుటకు, సదవకాశమే వినియోగించుటకు మంత్రి నయాను. ప్రజాసేవకుడ నయాను.

14-7-1986

నెల్లూరు

# 2 నల్లని అందగత్తె

అందగత్తె ! నలుపు ఎక్కువ. నీల మాణిక్యమే అన వచ్చు. "బెజవాడా ?" అని అడిగితే, "చీరాల" అని అన్నది. భర్త సాగనంప వచ్చాడు. అరవములో మాట్లాడు చుండినారు. ఫస్టు క్లాసులో ఎదుటి పరుపులో సామాన్లు పెట్టుకొని నేను కూర్చు న్నాను. మద్రాసు వదలింది రైలు. భర్తను చేతితో పలుకరిస్తూనే ఉన్నది చాలా సేపు !

పది నిమిషాల తర్వాత తేచి తలుపు మూసింది. ఫర్వా లేదులే అనుకొన్నాను. చిలుకు వేసింది. తన పరుపు మీద పండు కొన్నది. మే మిద్దరమే ఉన్న కంపార్టు మెంటులో చిలుకు వేయడం వింతగా ఉన్నది నాకు. ఎవరైనా వచ్చి తలుపు తట్టితే మే మిద్దరమే కనబడతాము గదా ! నేను నా పరుపు మీద పడుకొన్నాను.

ఆమె తెగువకు ఆశ్చర్య మేసింది. 'నా వేషం, వయస్సు చూచి ధైర్యంతో పరుండిం దేమో ! సామాన్ల జాగ్రత్తకై వేసిం దేమో!' అని సమాళించు కొన్నాను. నన్ను పరీక్షించుటకు కాదు గదా !

మాటలతో చనవు ఏర్పడుతుందని, నేను ఆమెను పలుక రించ లేదు. ఆమె సగము నిద్రలో, సగము మెలకువలో

నన్ను చూస్తుండినట్లే ఉండింది. చినిగిన మబ్బుల గుండా సంధ్యా కిరణాలు ఆమె ముఖము మీద పడి మెరిశాయి.

మాటా పలుకూ లేదు. అంతా నిశ్శబ్దం— రైలు చప్పుడు తప్ప. పుస్తకము తీసి చదువుచున్నాను. నాయుడుపేట దాటింది; గూడూరు సమీపిస్తున్నాము. సూర్యుడు కూడ పడమటి సముద్రములో సగము మునిగాడు. గూడూరులో "ఏదైనా అవసరమా?" అని అడగా లనుకొన్నాను; కాని అడగలేదు. లేచి తలుపులు తెరచాను.

నెల్లూరు సమీపించాము. దిగడానికి యత్నంలో ఉన్నాను. "మీ సంచి ఇక్కడ పెట్టకండి. కిటికీ నుండి కత్తితో చీల్చవచ్చు గదా !" అని అరవములో అన్నాను. "అవును" అని క్రింద పెట్టింది.

'వస్తాను' అన్నాను.

"సామాన్లు దింపడానికి సాయము చేస్తాను" అని లేచి నిలిచింది. "అక్కరలేదు. మా మనిషి వస్తాడు" అని దిగి వచ్చేశాను.

ఉదంతములో నాటకీయత ఏమీ లేదు. రభస ఏమీ లేదు. ఆమె పేరేమో? చీరాలకు ఎందుకు వెళ్ళుతుందో తెలియదు. నేను మరలా ఆమెను ఎన్నడూ కలియక పోవచ్చు. కాని, నల్లని అందగత్తె చిలుకు వేయడం నాకు ఆశ్చర్యం వేసింది; భయము వేసింది. అలవాటు లేని అనుభవమే. సామాన్లు దింపడానికి సాయము చేస్తా నని లేచి నిలవడం ఆనందాన్ని కలిగించింది.

మూడు గంటల మౌన లత రెండు మాటలు చిగిర్చింది. వాని ఆర్ద్రత నా డెందాన్ని నింపి వేసింది. ఉదార భావాలే

ఆమెవి. శృంగార భావాలు కావని తీర్పు ఇచ్చింది హృదయం.

చిన్న సంఘటనే! పెద్ద ఆనందాన్నే కలిగించింది ఆనంద క్షణాలు, అనుభవాలు, జ్ఞాపకాలు ఎన్నో వ జీవితములో !

25—7—86

నెల్లూరు

# 3 ఎన్ని ఆనందాలు

"మనిషి ఎన్నిటి కని ఆనందించగలడు ?" అంటాడు. డాక్టరు సంజీవదేవ్. చుట్టూ ఆనంద పారావారమే అలల లేపు తుంది. కళ్ళు ఎటు త్రిప్పినా, ఆనందమే కనుసైగలతో పిలుస్తు న్నది. ఇంత ఆనంద మకరందాన్ని పట్టి ఉంచలేక పోతున్నది హృదయ భాండము!

మనము వసించే భూమిలో ప్రతి వృక్షమూ సొంత సొగసులతో అందాలతో, ఆకుల వలువలతో, పువ్వుల నగలతో ఆనందాన్ని కలిగిస్తుంది. ప్రతి పక్షి కూతలతో, రెక్కల ఈకె లతో, ఎగురుటలో నడకలో ఇంపుగా ఉన్నది. ప్రతి జంతువూ అట్లే! ఇల ఒక ఆనందాల ప్రదర్శనశాల!

కాని, ఆనందించుటకు సహృదయత ఉండాలి. అనుభవ ముండాలి. తీరిక ఉండాలి. ఓపిక, ఆనందము ఒక మానసిక స్థితి, ఉల్లాసముతో కూడిన పరితృప్తి! సంగీత సాహిత్యాలనూ లలిత కళలనూ మెచ్చి ఆనందించుటకు కొంత పరిచయము, పరిజ్ఞానము అవసరమే!

కనులు పైకి ఎత్తితిమా, అంతా వింతే. వాన చినుకుల నుండి, ఉరుములు మెరపుల వరకు! భీతిని కల్గించే పిడుగు, వడగండ్లు, ఇంపగు మంచు కప్పుల నుండి ఇంద్ర ధనుస్సుల వరకు అంతా ఆశ్చర్యమే! ఇంకా లక్షల యోజనాలకు పోతే,

గ్రహాలు, నక్షత్రాలు, హెచ్చు తగ్గుల చంద్రుడు, సూర్యుడు ఎంత క్రమ శిక్షణతో, వేగముతో విహరిస్తాయి! అరుణోదయము సూర్యాస్తమానము, ఎండలు, గాలులు వెన్నెల చీకటి వాని వ్యక్తిత్వాలతో, రహస్య మంతనాలతో ఉత్సాహ తరంగాలు వేస్తేవే! ఏది కాదు ఆనందాన్ని కలిగించే అందం—మెచ్చే హృదయానికి? చుక్కల దూరాలే ఒక అద్భుతం. మనల చుట్టుకొని తిరిగే మానవుల సామీప్యాలే ఒక వింత. అనురాగాలు సంకల్పాలు, యత్నాలు. ఆకాంక్షలు అన్నీ రక రకాలు, ఎన్ని సమాన గుణాలో, అన్ని వ్యతిరేక స్వభావాలు! శారీరకముగా ఒకరి రూపు ఇంకొకరికి లేదు. ఒకరి గొంతు ఇంకొకరికి లేదు. అద్భుతమైన విభిన్నత్వపు వాతావరణములో వసించుచున్నాము.

ఆనందాలు అనంతం. ఎన్ని రుచులు. శ్రావ్యతలు, దృశ్యాలు, ఎన్ని పరిమళాలు గగుర్పాటును కలిగిస్తాయి!

ఎంతని, ఎన్నిటి నని ఆనందిస్తాడు మానవుడు?

ఆయుస్సు చాలని మానవుడు!

27–7–86

నెల్లూరు

# 4 ఎవ్వరది నవ్వుచు?

ఎవరది నవ్వుచు? నా కలల కొండమీద ? పోల్చతే కున్నాను, వేకువ పొగమంచులలో. ఎందుకు లోనతొలుస్తున్నావు నా మెదడు పాతరల?

నేను పోగొట్టుకొన్న వస్తువు లన్నీ కుప్పలుగా పడి యున్నాయి. విచ్చని కోరిక మొగ్గలు, కోరికల పండు టాకులు, రాలిన పువ్వుల రెక్కలు- ఆనందించి మరచిన పాట వలె ఉన్నాయి. పూర్తి కాని గేయ చరణాలు, పల్లవి లేని కీర్తనలు, రాగ తాళములు లేని కృతులు పాతరలో ఉన్నాయి.

మాసిపోయి, తుప్పుపట్టి, మాడిపోయి, కుళ్లిపోయినవి. వానిలో ఏమి వెదకెదవు? ఏమి ఏరెదవు?

ఎందుకు ఈ శ్రమ? వానిని నిద్రించనీ! బూడిద పూసు కొన్న నిప్పు కణాలు, కొడికట్టిన దీపాల వత్తులు, పగిలిన పాన పాత్రలు, గాజు, పెంకులు అన్నీ కుప్పలుగా ఉన్నాయి. అవి నీకు లాభము లేదు. నాకు అవసరము లేదు.

నీవు తొలగిపో! నీ కలల చుట్ట కట్టుకొని పో. నేను కోరేది నిద్ర, విశ్రాంతి, ఆనందం. ఆనంద సౌరభాల పీల్చు కొంటాను. దాని రుచుల చవిచూస్తాను. దాని రెక్కల చప్పుడుల వింటాను. స్పర్శచే పులకితుడ నవుతాను. ఆనందము నా చుట్టూ

అలలు అలలుగా పొర్లుచున్నది. ఎటు చూచినా ఆనందపు అవకాశాలే! ఆనంద మకరందాన్ని తాగి, మైమరచి, ఒంటరిగా ఉండాలి. ఆనందపు పరుపుమీద పరుండి దొర్లుతూ ఉండాలి. చింతలకు, చీకాకులకు తీరిక లేదు. సమయము లేదు. ఓపిక లేదు. శారద రాత్రి వలె ఉండాలి, మబ్బుల పేలికలు లేకుండా!

కార్చిన కన్నీరు చాలు. నీ నవ్వులు నా కిచ్చిపో! నీ రెక్కలు నాకు తొడిగి పో. నేను కొండమీదికి ఎగరాలి. ఆ ఎత్తులనుండి చూస్తాను లోకాన్ని ఆకాశాన్ని!

నేను పువ్వులు పూస్తుంటే అన్నీ అందంగా కన్పిస్తాయి. నేను ముసలి ఆకులు రాలుస్తుంటే, అన్నీ ఏడుస్తున్నట్లే తోస్తాయి. ఇతరుల బాగుచేసే ముందు, నన్ను బాగుచేసుకోనీ!

అదే నేను కోరేది నీవు తొలగిపో!
నేను ఆనందాన్ని పీల్చుకోవాలి ఒంటరిగా!

28-7-86
నెల్లూరు

# 5 అందాల పోటీ

శరత్ పూర్ణిమ నాడు హఠాత్తుగా ఒక ఆలోచన తట్టింది. నారదునికి. తమాషా కలహము పెట్టి చూడా లనిపించింది. ఇంద్రుణ్ణి సలహా అడిగాడు. నేలకు, నింగికి అని నిర్ణయించు కొన్నాడు. "నీవు అందగత్తెవు" అంటే 'నీవు అందగత్తె'వని ఇద్ద రినీ పోటీకి దింపాడు. 'అందాల పోటీ' అని మూడు లోకాలలో చాటాడు.

దేవతలు, మానవులు చూడడానికి వచ్చారు. త్రిమూర్తులు తమ తమ వాహనాల మీద విచ్చేశారు. ఇంద్రుడు అందరికీ స్వాగతం చెప్పాడు. రంభ, ఊర్వశి, మేనకలు బాగా అలంక రించుకొని, చిరునవ్వులు ఒలికిస్తూ, పువ్వులు, చందనము పంచి పెట్టారు. తిలోత్తమకు సిగ్గు జాస్తి. వర్గా స్త్రీ వలె ఎక్కడనుంచో చూస్తున్నది. మన్మథుడు తటస్థముగ నిలుచొని ఉపేక్షగా చూస్తు న్నాడు. వాయువు, అగ్ని పందెపు జడ్జీలు. ముందు 'నేల'నే తన అందాన్ని చూప మనీ ఆనతి ఇచ్చారు

పందెం ప్రారంభ మైంది. అందరూ నిశ్చేష్టులు. మాన వులు తాత్కాలికముగ అనిమేషు లయ్యారు. నిశ్చలమైన వాతా వరణము. సర్వత్రా ఉల్లాసముతో కూడిన ఉత్కంఠ. 'భూమి' వేదికమీదికి వచ్చింది. చిగుళ్ళతో నేయబడిన వస్త్రాలు, మొగ్గ లతో పువ్వులతో పొదగబడిన నగలతో, చందనముతో రంగ

రించిన పుష్పోడి మైపూతలతో, గుప్పు మంటూ పర్వే సువాసనలతో, సగము విచ్చిన పెదవుల కెంపులతో ముత్యాల వరుసలతో వచ్చి నిలిచింది. నేపథ్యములో వసంత రాగములో కమ్మని పాటలు. అందరూ ఆనందముగ రెప్ప పాటుల మరచి గగుర్పాటుతో గమనిస్తున్నారు. తొలుతగ చెట్లను చూపింది. రక రకాల రూపులతో రంగులతో ఊగే కొమ్మలతో, చల్లగ వీచే తెమ్మెరలతో ఆకుల మువ్వలతో మనోహరముగ ఉండినది దృశ్యము. ఎన్ని రకాల చెట్లు, తీగలు, పువ్వులు, పంట చేలు!

మృగాల చూపింది. పొడవు దంతాలతో నున్న ఏనుగులు జూలును, విరబోసికొన్న సింహాలు, పసుపు, శ్రీచూర్ణము పట్టించిన పులులు, ఎత్తైన గుర్రాలు, ఎద్దులు, బిత్తరి చూపుల జింకలు వగైరాలు ఎంత గాంభీర్యము, ఠీవి, గమన చాతుర్యము!

పలు విధము లైన పక్షుల చూపింది. రంగుల కలయికల ఈకెలతో ఎగిరే పక్షులు, నడిచే పక్షులు. కలగానాల కచ్చేరీల చేసేవి. మాటలు పలికే రామ చిలుకలు. నాట్యము చేసే నెమళ్ళు, పంచమ స్వరాన కోకిలమ్మ పాటలు పాడింది భిన్న కీటకాలను రమ్మన్నది. రంగుల తుమ్మెదల చూపింది. ప్రాకే సరీసృపాలను ఆడించింది. చివరగ ఎత్తైన తుషారగిరి శిఖరాలను, అలల పంపరలతో తడుస్తూ ఎగిరే సముద్రాలనుచూపింది. అద్భుతమైన విశాలమైన రంగవల్లిలాగ ఉండింది. దేవతలు విస్మితు లయ్యారు. మానవులు హర్ష ధ్వానాలు చేశారు. త్రిమూర్తులును, భార్యా సమేతులై బృంద ఉత్సాహాన్ని చూపారు. భూమి అందరికీ నమస్కరించి, నిర్ణేతల అనుమతితో సెలవు తీసికొన్నది. పోతూ రంభా ఊర్వశుల పలుకరిస్తూ పోయింది.

కొంత సేపు విరామం......

నారదుడు 'నింగి' చెవిలో, "చూశావు గదూ నేల నేర్పు, సొంపు ? నీ వెల్లా ప్రదర్శిస్తావో నీ నైపుణ్యము!" అని కవ్వించాడు. నింగి వేదిక పైకి వచ్చింది. వంగి వంగి నమస్కరించింది. వెలుగు నీడల దుకూలాలతో, మెరుపుల తళుకులతో వచ్చింది.

నీల నేపథ్యములో అంతా శూన్యం, అంతా నిశ్శబ్దం.

గంభీరంగా, మౌనంగా నిలిచింది కొంత సేపు.

చంద్రోదయాల, సూర్యాస్తమానాల, నక్షత్రాల చూపింది.

"ఇవి మాకు నిత్య పరిచితాలే. నీ దూర బంధువుల సంపదలు! నీదైనదిచూపు" అన్నారు నిర్ణేతలు. ఉద్రిక్తత రెట్టింపు అయింది. ఆగి సంధ్యారాగం ఎర్ర అంచుల తెల్ల మబ్బుల చూపింది. కొన్ని ఐరావతాల వలె ఉన్నాయి. కొన్ని నందీశ్వరుని వలె, కొన్ని హంసల వలె!

దొర్లుతూ ముసురుతూన్న నల్ల మబ్బుల చూపింది. నీల జలాలలో ఈదులాడే తిమింగిలాల వలె కొన్ని, యమ వాహనాల వలె కొన్ని ఉన్నాయి. రాజ హంసల, బలాకల బారుల చూపింది. వ్రేలాడే తోరణాలుగ కన్పించాయి. వరుసగా తుంపరల జల్లుల, కుంభవృష్టి ధారల చూపింది. ముత్యాల, రత్నాల అభిషేకించినట్లుగ ఉండింది. మెరపుల వయ్యారాల కులికించింది. ఉరుముల సింహనాదము చేసింది. వడగండ్లను క్రుమ్మరించింది. పిడుగుల వేగాన్ని భీకరత్వాన్ని చూపింది. పొగమంచుల తెరలను, నదుల పొంగుల నవ్వులను, సుడిగుండాలను చూపింది. జలపాతాల హుందాతనాన్ని చూపింది. మరు భూముల సస్య శ్యామలతను చూపింది. తన వర్షముచే పులకిత గాత్రులగు పర్వతాల ప్రద

ర్శించింది. "ఇదంతా నా మహిమ కాదా ? నా నేర్పు కాదా ?" అంటూ రోషముతో కూడిన నవ్వుతో అన్నది.

చివరకు బ్రహ్మాస్త్రమునే ఎక్కు బెట్టింది. ఉత్తర, దక్షిణ అంచుల తాకే ఇంద్రధనుస్సునే చూపింది. వివిధ వర్ణముల సౌందర్యాన్నే ఒలికించింది. రమ్యమైన వంపులు, అకళంక మనోహరత్వాన్నే, కన్నుల గగుర్పాటునే కలిగించాయి. స్వర్గ మయూరము పింఛము విప్పి, నాట్యము చేసినట్లే ఉండింది. లక్ష్మి, పార్వతి, సరస్వతులు సంతోషాన్ని దాచలేక పోయారు. త్రిమూర్తులు 'సాధు' 'సాధు' అని అప్రయత్నముగనే అన్నారు. అది విని నిర్ణేతలు నింగిదే గెలుపని ప్రకటించారు. దేవతలు మానవులు సంతోషపు కేకల నిడినారు. గంధర్వులు, కిన్నరులు ఆనంద భైరవి, అమృత వర్షిణి రాగాలలో భజనలు చేశారు. రంభ, ఊర్వశులు వికసిత వదనారవిందలై వేదికమీదికివచ్చారు. దేవేంద్రుడు సకల కళాభినేత్రి యగు శ్రీశ్రీ సరస్వతీదేవిగారిని బహుమతి ప్రదానము చేయ మని విన్నవించాడు. సరస్వతీ దేవి తన వీణనే నింగికి బహూకరించింది. నేల 'నింగిని' అభినందించింది.

ఆ వీణే కళలకు మూలాధార మైన కల్పన!
కల్పన 'నింగి'ది, కళ భూమిది.
కళను ఉత్తేజ పరచేది స్ఫూర్తి. అదే కల్పన.
కల్పన లేని 'కళ' కాంతిహీన మగుతుంది.
'కళ' కళేబరము. 'కల్పన' ప్రాణము.
కళా మురళిలో కల్పనా ప్రాణము చేరినపుడే
మధుర స్వరాలు ఉత్పన్న మయ్యేది!
భువన గగన సౌందర్య స్పర్ధలో
కళకు కల్పనాభిషేకము జరిగింది.

మాట పాటైనది. నడక నృత్య మైనది.
శిల శిల్పమై స్వప్న సుందరి యైనది.
అందరికీ వీడ్కోలు చెప్పాడు ఇంద్రుడు.
నారదుడు పాడుచు గంతు వేశాడు.
రంభాదులు బృంద గానముగ గొబ్బిళ్లు తట్టారు.
'నింగి' ఆనంద బాష్పాలు చల్లింది.

31-7-86
నెల్లూరు

# 6 మూల పారవేసిన మురళి

ఎందుకు నేను మూల పారేసిన మురళిని తెచ్చావు ? ఊపిరి పోసి రాగ రాగిణులు మ్రోయిస్తున్నావు ? చిన్నతనము నుంచి వాయించి వాయించి వెగటు పుట్టిన రాగము పలికిస్తున్నావు ? స్వరములు వేస్తావు? స్వరములో కొన్ని తప్పులు పడినా, మధురముగానే ఉండేవి. సరి దిద్ది మరలా పాడమని కోర్తావు ? మరచిన వానిని మరలా మేల్కొలుపుతావు ? పాత కాలాల మాటలనే త్రిప్పి త్రిప్పి చెప్తావు ? అలవాటైన వానికే మోజు. నలిగిన బాటనే పోవాలా ? పాత రుచిని మరిగి, క్రొత్తకు పెడమొగమా? ముందుచూపు లేదా? క్రొత్త యుగాలకు పోలేమా ? క్రొత్త కొండల ఎక్కలేమా ? క్రొత్త పాటల పాడ లేమా ? క్రొత్త ప్రయోగాలను చేసి, క్రొత్త తియ్యందనాన్ని పుట్టించుట కష్టమా ? నేర్పినవే పాడుచుంటే, మన నేర్పు ఎక్కడా ? ముందుకు కబోదిగానే ఉండాలా ? తాతలు ఇచ్చిన దానిని భద్రంగా దాచి, మనవళ్ళకు ఇచ్చి పోవాలా ? చేర్చేది ఏమీ లేదా ?

క్రొత్త కృతులు, జావళీలు వ్రాయకూడదా ? క్రొత్త తిలానాలు రచించి, క్రొత్త అడుగులతో ఆడించి సంతోషింప కూడదా ? అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్యలు ఈ వెనుక చూపే చూస్తుంటే సంగీత శాస్త్రము, సాహిత్యము ఏమై యుండేవి ? నిత్య శిశిరములో పడి. వసంతమే తెలియక పిడచ

గట్టిక పొయ్యేవి. అన్నీ పెరుగుచున్నవి. క్రొత్త మొక్కలు తోటల్లో పెరుగుచున్నవి. క్రొత్త అంట్లు, క్రొత్త వంగడాలు వచ్చి పంట అధిక మగుచున్నది. యుగ ధర్మమే మారుతుంటే శాస్త్రీయ సంగీతము స్తబ్ధముగా ఉండా లంటావు? క్రొత్త వేళ్లకు క్రొత్త కొమ్మలు పుట్టనీ! సంకర జాతు లని తూలనాడితే సరి పోతుందా?

క్రొత్త కోళ్ళు, గేదెలు, గోవులు వృద్ధి పొందుట లేదా? క్రొత్త వేషాలకు, వ్యవస్థలకు తలుపులు తెరచుట లేదా? విడా కులు మారు మనువులు అప్పుడు లేవే! తలగుడ్డలు పోయినవే! ధోవతులు మాయ మగుచున్నవే! కాల చక్రాలు తిరుగుచునే యున్నవే! ఎందుకు సంగీతములోను మార్పులు రాకూడ దంటావు? మార్పు లన్నీ జనాదరణ ముద్ర పడితేనే అంగీక రిస్తారు. కాల ముద్ర పడితేనే అది శాస్త్రీయ మగుతుంది.

వేళ్ళకు లేదు వసంతము; కొమ్మలకే! క్రొత్త పువ్వులు పూచేది వసంతములోనే. వేళ్ల బలము కావాలె, కొమ్మల క్రొత్త దనానికి.

'అక్షయ'లు పోవాలి. 'ప్రభవ'లు రావాలి. కృష్ణపక్షాలు పోవాలి. శుక్లాలు రావాలి. అదే కాల నిర్ణయం. క్రొత్త సంగీతము పల్లవించనీ! వేణు హృదయాన్ని క్రొత్త సంగీతము సంతోష పెట్టనీ! క్రొత్తసుప్రభాతాలు పాడి, క్రొత్త దేవుళ్లను మేల్కొలుపు దాము. క్రొత్త శాస్త్రీయ సౌరభాలు మురళి మది నింపనీ! క్రొత్త శ్రావణ మెరుపులు దిగంతములు మెరవనీ!

నవ రస ధారలు కురవనీ,

ఎందుకు క్రొత్తకు పెడముఖం?

ప్రపంచము చచ్చిపోయిన వారిదా, బ్రతికియున్న వారిదా?

3-8-86,

మద్రాసు.

# 7 ఔదార్యము

భాష ఒక నాటిదా? శతాబ్దాలుగ వికసిస్తూవస్తున్నది. కొన్ని మాటల వదలుచున్నది. క్రొత్తమాటలు చేర్చుకొనుచున్నది. భాష పెరగకుంటే, నిర్జీవమైన దన్న మాట! వాడల భాష పామర భాష యాయెను. పండిత భాష యాయెను. వచనము పద్య మాయెను. పాట యాయెను. పాటకు లయ చేరెను. నృత్య మాయెను. జ్యతి స్వరము తిల్లానా యాయెను. సాహిత్యము సంగీత మాయెను. ఇవి ఎన్ని యుగాల మార్పులో! కాన్పించకనే మారుతూ వస్తున్నడి. ఉదయము మధ్యాహ్నమై మెరసి నటుల, మొగ్గ పువ్వుగ నవ్వినటుల, రానున్న కాలాల్లో ఇంకా మారుతుంది. యుగ ధర్మము పరివర్తన!

ధోవతి యుగం పోతున్నది. మగ వాళ్ల సిగ పోయిందనే చెప్పొచ్చు. ఫ్రాక్- పావడాగా తేలింది. చీరగా ఆరవేశారు. ఈ దశాబ్దిలో జీన్సు ఎక్కువైనాయి. మారడం సమాజ లక్షణం. స్తంభించి యుండటము సమాధి స్థితి. నా తర్వాతనే శ్రీ మోటూరి సత్యనారాయణ హిందీ ప్రారంభించారు. ఆయన ఎదిగి గగన చుంబితు డయ్యాడు. నేను తూరుపు కనుమల ఎక్కుచున్నాను. ఢిల్లీ, ఆగ్రా, మద్రాసు వారి ఉన్నతికి సాక్ష్యాలు. ప్రచారానికి సోపానాలు. మద్రాసులో మహత్తర కార్యము సాధించాడు. ఫలితము హిందీ వ్యతిరేక ఉద్యమమే! ప్రహ్లాదుడికి హిరణ్య

కశిపుడు పుట్టాడు. క్షీర సాగరమును క్షార సాగరము మ్రింగే సింది.

శ్రీ నాగభైరవ సామాజిక స్పృహ అని ప్రచారము చేస్తారు. అంటే అతని కన్నీరా? బీదల కడగండ్లా? విప్లవము, సంహారమా? మాది సౌందర్య స్పృహ, ఆనంద చైతన్యము. ఎక్కడ ఆనంద మున్నా, సౌందర్య మున్నా అన్వేషిస్తాము; వెలుగులోనికి తెస్తాము. కన్నీటిలో అంద మున్నా వదలము. బురదలోని తామరను వదిలామా? ముళ్ల గులాబీని వదిలామా? తెరపై తేలే నీడలను, వెనుక దాగే వెలుగులను వదలలేదు.

జీవితపు నాలుగు కోణములను గమనిస్తాడు- పూర్ణ మానవుడు. ధర్మ, అర్థ, కామ, మోక్షములలో ఏది లోపించినా పూర్ణత్వానికి లోటే. వెలితిగా ఉంటుంది. నీతిగా వస్తువులను కోరి ప్రాప్తించుకొనుటయే ధర్మార్థ కామ మోక్షములంటే. సామాజిక స్పృహలో వస్తువుల లేమిని వర్ణిస్తాడు, మేము కలిమిని కూడా వర్ణిస్తాము. ఉంటే గదా లేదనుకోవడం! లేనిదానిని లేదంటే లాభ మేమి? ఉన్నవానిని చెప్పి, లేనివానిని వెదకి, కోరి యత్నించి సంపాదించుట మానవుని లక్ష్యము. జీవితము అతుకుల బొంతేనా? రంగుల, వాసనల తోట కూడా బ్రతుకులో ఒక భాగమే. జీవితము శిశిర రుతువు మాత్రమేనా? ఇతర రుతువుల ఆనంద మకరందాలు లేవా? పండి రాలే ముసలి ఆకులనే చూస్తే ఎట్లా? నవ జీవనపు ఆశా జ్యోతులుగ కిసలయాలు పుట్టుకొస్తున్నవి గదా! బహుళ చతుర్దశి, అమావాస్యలు మాత్రమేనా ఆకాశము? శుక్ల విదియ చంద్రులు లేరా? వారు వచ్చే పెరుగుదలను సూచిస్తూ ఉన్నారే!

అల పడి లేవదూ? లేముల నిట్టూర్పులు నిరాశను ప్రకటిస్తే చాలుతుందా? సంపూర్ణ జీవితాన్ని చూడవద్దూ? ఆదర్శాన్ని

ఆచరణలో పెట్టి శ్రమించే వారూ నిట్టూర్పులతో నిండిన వారే. కవిత వ్రాసి పూర్తి చేయగానే సంతుష్టితో నిట్టూర్పు వచ్చేదే. రమ్యంగా నృత్య మొనర్చిన పిదప అట్లే ఆనందపు అలసట నిట్టూర్పులే!

త్యాగి, దాత శ్రీ యార్లగడ్డ వెంకన్న చౌదరి ఆరంభించిన సన్మాన ఉద్యమము ఆరు వత్సరాలు సాగింది. స రి గ మ ప ద వద్ద ఆగి స్వర్గస్థులయ్యారు. 'పద!' అంటూ శ్రీ శంభుప్రసాద్‌ను ఆజ్ఞాపించారు. 'ని' నుండి పై మెట్లు ఎక్కాలి శంభుప్రసాద్! కఠినమైనా సరళ మార్గాలే శ్రద్ధతో దీక్షతో చేస్తే. ఔదార్యం సర్వదా సర్వత్రా విస్తరిల్లు గాక!



**4-8-86,**

మద్రాసు.

# 8 జీవించనీ!

'జీవించు!', 'జీవించనీ'! అనే సూక్తి ఎప్పటిదో!

జీవన శాస్త్రములో ప్రముఖమైన సూత్రము! 'సుఖముగ బ్రతుకు, ఇతరులను సుఖముగ బ్రతకనీ'! అనే వేదాంత సారము ఆచరణలోకి ఇంకి ఉంటే, భూ లోకము స్వర్గ తుల్యముగా ఉండేది. నీవు కోరేది ఇతరులకు దక్కరా దనే ఈర్ష్య! మనిషిని మనిషి ద్వేషించి నంత పులులు, పాములు ద్వేషింపవు. కలహాలు, సమరాలు ఎక్కడ నుంచి పుట్టాయి? పవిత్ర గ్రంథాలైన రామాయణ, భారతాదులలో ఎన్ని సమరాలు, ఎంత రక్తపాతము!

'జీవించుట'లో చూపిన ఆసక్తి 'జీవించనీ'లో లోపించింది అనాదిగ. తొలుత ఈటెలతో కత్తులతో జరుగుచుండిన పోరులు బాణాలకు అస్త్రాలకు ఎదిగాయి. తుపాకులకు ఫిరంగులకు పెరిగాయి. బాంబులుగ విమానాల లోనికి జొరబడ్డాయి. అణుబాంబులు, రాసాయనిక బాంబులు పట్టణాల మీద పడ్డాయి. ప్రస్తుత ప్రమాదము ఖండాలనుంచి ఖండాలకు ఎగిరే, దుమికే మిసైల్స్. నిమిషాలలో లక్షల మందిని ధ్వంసము చేయగల శక్తి భూతాన్ని మానవుడు కనుగొన్నాడు. విజ్ఞానము ఎంత సుఖమును ఆనందమును కలిగించిందో, అంత వినాశాన్ని, విషాదాన్ని సృష్టించింది. ఒక చేతిలో అమృతాన్ని, ఒక చేతిలో విషాన్ని పంచే

మోహినీ సుందరి విజ్ఞానము!

ఈ శతాబ్దములో రెండు ప్రపంచ యుద్ధాలు జరిగాయి. ఎన్ని లక్షలమంది చనిపోయారో, ఎంత కన్నీరు కారిందోలెక్క-లేదు. యుద్ధ భూమి కాని మన దేశములోను ఎంతమంది చావు ఒడిలో నిద్రించారు! క్షామముతో దేశ విభజనలో ఎంతెంత మంది చనిపోయారు. మతము పేరిట హత్యలు! భాషల పేరిట హత్యలు!

పొట్టేలుకు, మేకకు విలువ యున్నది. మనిషి ప్రాణానికి అంత విలువ కూడా లేదు. మనిషినే కాదు, మృగాలను చంపుతాము. వృక్షాలను నరకుతాము. పులులను, జింకలను చంపుతాము. ద్వేషముతో మనిషిని చంపితే, వినోదానికి, లాభానికి జంతువులను, పిట్టలను, చెట్లను చంపుతాము.

మానవునిలో దైవాంశ ఉన్నటులే, రాక్షసాంశ ఉన్నది. అందుకనే 'జీవించు, జీవించనీ' అనే సకల ధర్మ సారాన్ని ప్రచారము చేస్తున్నారు. ఈ సారాన్ని గుండెల్లోనే కాదు. ఎముకల్లోకి, నాడులలోనికి ఇంకించి, ప్రసరించేటట్లు చెయ్యాలి. అప్పుడే మానవత్వపు తోటలో కొమ్మకొమ్మకు పువ్వులు పూచేది. మానవత్వపు పెదవులపై చిరునవ్వు పాటలు పలికేది! గుడ్లగూబలు పోయి, తోటకు కోకిలలు వచ్చేది!

3-5-1986,

నెల్లూరు.

# 9 చీకటి కేశములు

రాత్రి చీకటి కేశములు నన్ను కప్పి జోకొట్టినపుడు, కలల దేశములో నలు దిక్కులు తిరుగుచుండి నపుడు చూస్తూ కాపలా కాస్తుండిన దీపము ఆరిపోవుటకు సమయము వచ్చినది. పడమటి దిక్కున చుక్కలు కను సైగలతో పిలుస్తున్నవి.

దీపము సెలవు తీసికొని వెడలుటకు ముందు ఎన్ని నిట్టూర్పులు వదలుతుంది? కొన్ని వేళల చిరునవ్వులు కూడా నవ్వుతుంది. వంగి వంగి సలాములు చేసి కడకు వెళ్ళిపోతుంది. ఆరిపొయ్యే దీపపు కథ విషాద గీతే! చీకటిలో చూపుకు ఎల్లలు లేవు. ఎటు వైపున నైనా ఎంత దూరమైనా రివ్వున వెళ్లగలదు. దీపపు వెలుగుకు కొన్ని అడ్డులు తరుముతూ, ఇరుకున పెడతాయి. దృష్టి స్వేచ్ఛను హరించి బందీని చేసి నాలుగు గోడల మధ్య పడేస్తాయి. కాని దీపపు నిషేధాజ్ఞలు కలల రాజ్యములో చెలామణీ కావు. అవి అమలు పరచని ప్రభుత్వ అధికారాలే!

వయస్సు పెరుగుచుండ కోరికలు పెరుగుచుండును. తీగల వలె పెనవేసికొనే ప్రాకుచుండును. సహజమైనవే! విపరీతాలు, వింతలు కావు. మానవ దౌర్బల్యాలలో అంశమే యనో, సహజమైన వనో గుర్తిస్తే వింతగ తోచవు. విడనాడ వలసినవే, కాని విపరీతాలు కావు.

31-8-1986,

ఢిల్లీ.

# 10 వరూధినులు లేరు

పెద్దన్న కాలములో ఏమో కాని, ఈ నాడు వరూధినులు లేరు, ప్రవరాఖ్యులు లేరని తోస్తుంది.

అంత పచ్చిగ, మొరటుగ పైనబడి, వలచిన వానిని బలాత్కరించే మగువలు సినిమాలలోకూడ కాన్పించరు. పార్కుల పొదలలోను కాన్పించరు. అరుణ దీపాల వీథులలోను దొరక రేమో! ఎంత సీతి మాలినా, సిగ్గు వీడినా, అంత సాహసముగ వ్యవహరించ రని నా ఉద్దేశ్యము. ఇతర దేశములలోని వ్యవహారములు నా కల్పనా చక్షువులకు దూరములే!

ఇక ప్రవరాఖ్యులకు వస్తే, దుర్లభమైనా ఎవరో ఉండ వచ్చు. కారణములు ఏమైనా కావచ్చును. ప్రభుత్వ భీతి, సంఘ భీతి వెంటాడుచునే ఉంటాయి. నలుగురిలో పరువు పోతుందని భయము! నైతిక నిష్ఠ ఎక్కడో అతనిని పట్టాలు తప్పకుండ చేయవచ్చును. అట్టి వారు తలవంచి నమస్కరించ వలసిన మహానుభావులే!

వయస్సు మళ్ళిన వారు అపరాధి భావముతో చెప్పలేని స్థితిలో ఉన్నారు. కొందరు అవకాశము చిక్కినపుడు విపరీత చేష్టలలో తాము అణచి పెట్టుకొన్న ప్రవృత్తిని చూపిస్తారు. దాసీలతోనో, దగ్గర చుట్టాలతోనో క్రియాన్విత సల్లాపాలు ఆడుతారు. కామ వికారాలు పలు రూపములలో దర్శన మిస్తాయి.

ప్రకృతిలో దాగియున్న అనేక బలీయమైన శక్తులలో ఇదీ ఒకటి. శాస్త్రిలు, సంఘం, నిజ సంస్కారము నిషేధస్తున్నా, ఎందుకో ఈ ఆకర్షణ ! శక్తిమంతమైన ఈ అకర్షణ ?

మనము గౌరవించే వారు, పూజించే వారు పెద్దలు తప్పులు చేశారని వింటాము. కొన్ని రుజువులు కూడ దొరక వచ్చు. నిజము కనుగొనవలె నని విచారణలు జరిపి ఆ గౌరవ నీయుల వికారాలను బయట పెట్టుట న్యాయము కాదు. నేపథ్య జీవితములోని రహస్యాలను ప్రజల దృష్టిలో ఆరపోయుట వలన లాభ మేమి ? ఎవరికి శ్రేయస్సు ? సహజమైన దౌర్బల్యమే కాని అస్వాభావిక మైన విపరీత మేమీ కాదు. అట్టి నిజాలను వెలికి లాగ కుండుటే మేలు కాదా ? మోసము చేసి లాభము పొందితే, బలాత్కరించి మలినపరిస్తే, బహిర్గతము చేయుట మంచిదే! అది కూడ కింవదంతుల మీద కాక, రుజువుల మీద నిలబడాలి. పెద్దవారి అపవాదుల ప్రచారము చాల మందికి సర్దా, వినోదము! అట్టి ప్రచారాలకు దిగుట న్యాయము కాదు. సున్నితమైన రాణుల గుట్టులను దాసీలే ప్రచారము చేస్తూ 'ఎవ్వరికీ చెప్పకండి' అంటూ చిరునవ్వులు నవ్వుతారు. అది నిశితమైన, రహస్యమైన, నీతికి దూరమైన విషయము! దానిని ఉదారంగానే చూచుట, ఉంచుట మంచిది కాదా ?

31-8-1986,
ఢిల్లీ.

# 11 కౌగిలి లేదు

చాలనాళ్ళ పరిచయము ! పరిచయ లత పల్లవించింది. మొగ్గ తొడిగింది. సాహిత్య సభలలో పెండ్లి పేరంటాలలో కలిసుంటారు. ఆదరంగా, స్నేహముగా మాట్లాడుకొనే వారు. ఆమె వ్రాసిన వ్యాసాలు ఆయనకు ఇచ్చేది. సమీక్షగ, స్తుతి పరంగ ఎప్పుడైనా ఉత్తరాలు వ్రాసేవాడు. ఆతిథ్యాలు అప్పు డప్పుడు ఉండేవే!

ఆమె ఇంగ్లాండు పోయి, పెద్ద డిగ్రీ సంపాదించి తిరిగి వచ్చింది. ఒకటి రెండు సారులు ఇంటికి వెళ్ళి, అచ్చటి విషయాలు చర్చించేవాడు. తొలినాటి స్నేహము యథారీతే ఆప్యాయముగనే ఉండేది.

''ఆదివారము చూడ వస్తాను. ఇంట్లో ఉంటావు గదా!'' అని టెలిఫోను చేశాడు. "నేనే వస్తాను'' అన్నది ఆమె. రెండవ సారి కూడ అట్లనే నొక్కి చెప్పింది. ఎంతగానో సంతోషం వేసింది. పండ్లు తెచ్చి పెట్టాడు. ఇంటివారు సెలవులకు ఊరికి పోయినారని ఆమెకు తెలుసు. కారు నడుపుకొంటూ చెప్పిన సమయానికి వచ్చింది. "ఎందుకు ఈ శ్రమ?'' అంటే, ''ఏమి రాకూడదా ? నీవు ఎన్ని సారులు వచ్చావు'' అన్నది. తోటలోని రెండు గులాబి పువ్వులు తెచ్చి యిచ్చింది. మొగ్గ తొడిగిన స్నేహం పువ్వు అయింది. ఆమె హృదయపాత్ర ప్రేమ సుధనే

తెచ్చింది. హృదయ వీణను మీటుకొంటూ వచ్చింది. ఆప్యాయత తోనే మాట్లాడుకొన్నారు. పండ్లమీద ఆమెకు ఆసక్తి లేదు. పువ్వులమీద ఇతనికి అంతే! అతను ఆమెను చూస్తూ, వింటూ ఉండినాడు. ఆమె అంతే! భోజన సమయాన వీడ్కోలు! ఇద్దరూ లేచారు. ఒకవైపు దగ్గరగా చేర్చుకొని, 'మనము స్నేహితుల' మన్నాడు. 'చాల నాళ్ళ స్నేహితుల' మన్నది ఆమె. మరలా చూచుకొని, కారు వద్దకు వెళ్ళారు. బ్రేక్కు ఆడిస్తూ, కారు నడుపుకొంటూ వెడలింది.

కౌగిలి లేదు, ముద్దులు లేవు.
నిరాశతోనే వెడలిందా ?
ఏమో !

4-9-86,
నెల్లూరు.

# 12 వసంత మదిరము

వసంతము నవ్వుతూ వచ్చింది. వనము హర్షముతో రోమాంచిత మైంది. ఆకాశము వెలుగులతో, భూమి సువాసనలతో క్రమ్మి పోయాయి. కబోదిగ నుండిన మొగ్గలు కన్నులు తెరచాయి. కొన్ని పూర్తిగ వికసించాయి. అంతా ఆనంద కిరణాలే, సౌరభాలే !

ఎక్కడో ఎట్లో జరిగిన ప్రమాదము చేత తుమ్మెదలు రాలేదు. పువ్వులు ఎదురు చూచుచునే యున్నవి. ఆశలు హృదయములో వయ్యారాల చూపుచునే యుండినవి. అనుకోని ఆలస్యమే యైనది. ఇంతలో హృదయ సుధా మకరందము క్రమ్మగ్గి మదిర మైనది. వసంత సమీరాలు దాడి వెడలి దోపిడీ చేశాయి. తాము కొంత సేవించి, గబగబ పోయి వృక్షాలకు, లతలకు అందించాయి. క్రమేణ వనాని కంతా కైపు ఎక్కింది. తర్వాత దృశ్యాలు తమాషాగాను, వింతగాను ఉండినాయి. చూడముచ్చటగనే ఉండినది.

తలలు విరబోసికొని కొన్ని, అర్ధ నగ్నముగా కొన్ని చెట్లు, తీగలు గంతులువేశాయి. నిలిచిన నెలవుల వీడక చిందులు త్రొక్కాయి. తలల విసరులతో ఊపాయి. పళ్లు పటపట కొరికాయి. కొమ్మల చేతుల పైకి సాచి భజనలు చేశాయి. లతలు

మైమరచి లాస్యము చేశాయి. ఎలమావి గున్నలు దరువులు త్రొక్కాయి.

వసంతం ఉన్మత్తతా విశ్వరూపముతో ప్రదర్శన మిచ్చింది. వింత వింత కూతలు, కేకలు, చిందులు! వనాని కంతా పిచ్చి పట్టిన ట్లైనది. ఈ కోలాహలాన్ని చూస్తున్న సూర్యుడు నవ్వుతూ ఆగిపోయినాడు. తెల్ల మబ్బుల భుజాల మీద చేతుల వేసి, నవ్వుచుండినాడు.

సమీరాలు వ్రేళ్ళతో తీగలు మీటుచుండినాయి. చెట్లు తంబూరాను వినిపిస్తుండినాయి. ఎన్నడు ఎరుగని సందడి, సంబరము. చెట్ల జాతర. తోట తిరునాళ్ళు. ముసలిదై శుష్కించిన ఏరు బోసినోటితో విడ్డూరముగ నవ్వుకొను చున్నది. గుట్టలు దుమ్ము జెండాను ఎగురవేశాయి. కొండలు నింగినుండి తరువుల నల్ల మత్తును చవి చూశాయి. నిశ్చలముగా చతికిల పడి కూర్చున్నాయి.

గ్రమ్మిన మకరందం ఎంత పని చేసింది?

12-9-86,

నెల్లూరు.

# 13 ఆత్మీయుల మరణము

ఆత్మీయుల మరణము ఎంత క్రుంగదీస్తుందో, అంత ఉత్తేజ పరుస్తుంది కొన్ని వేళల! మంచి సంకల్పాలకు, ఆచరణ విధానాలకు, దాన ధర్మాలకు, కార్యక్రమాలకు మూల మగుతుంది. మనోరథ మందాకినులకు గంగోత్రి యగుతుంది.

మరణము చిర వియోగము. అనురాగముతో, గారాబముతో పెంచుకొన్న ఆత్మీయతా బంధాలు శాశ్వతముగా తెగిపోయి, ఇక ముడిపడ వీలులేని స్థితిని చేరుతాయి. వరదల్లో ఏటి పడవ ఒకరిని ఆవలి గట్టుకు కొనిపోయి మాయము చేసి నటుల ఉంటుంది. భరింపరాని దుఃఖముగా కాన్పిస్తుంది. గుండెమీద రాతిబండను పెట్టినటు లుంటుంది. కాని కాల మనే ధన్వంతరి ఓదార్పులను, ఔషధాలను వాడుతూ సమాళించు కొంటూ వస్తాడు. వేదాంతపు అవలేపనాలను, విధి నవనీతాలను రాస్తూ వస్తాడు. కాలము గడిచేకొద్దీ, బరువు తేలిక యగుతూ వస్తుంది. వియోగ స్మృతిని పదిల పర్చుకోవాలని పూనిక పుట్టుతుంది. అసలు పోవనే పోయింది, దక్కిన వడ్డీ లేశమైన దాచుకొందామని ఔదార్యము జన్మిస్తుంది. అట్టి మానసికస్థితిలోనే తాజ్ మహల్‌కు పునాది పడింది. సౌందర్య కళా నికేతనమై వెలసింది. ఎన్ని దేవళాలో, ధర్మశాలలో, బడులో, బావులో అట్టి విషాద పరి

స్థితిలోని త్యాగ దీక్షతో, ఔదార్య భావముతో మూర్తీభవించినవే! జ్ఞాపక చిహ్నాలుగా నిలిచి ఉన్నవే! చెట్టు పోయినా, నీడను సంరక్షించుకొన్నటుల.

ఏకైక దుహితను పోగొట్టుకొన్న తల్లి తండ్రులకు అట్టి సంస్కార సంకల్పము జనించుట సహజమే. బలీయమైన చిర వియోగమునకు వినమ్రముగ తలయొగ్గి, శరణునొందుటే ఉత్తమ మార్గము. వాడిన వకుళము యొక్క వీడని వాసనను భద్రపరచుకో వలె నని వాంఛ. అదే యత్నమై, ఉద్యమమై ఆరంభ మయ్యాయి- పండిత సన్మానాలు, ఉపన్యాస వార్షిక సమావేశాలు! పుత్రిక స్మృత్యంకముగా ఏటేట జరిపే కృషి ఫలితమే ఈ వడ్ల కుప్పలు! ప్రకాండులైన పండితుల నాహ్వానించి, సన్మానించారు. వడ్లకుప్పల నూర్చినారు. ఆ ధాన్యరాశే, వ్యాసములై గ్రంథస్థ మగుట ముదావహము. మృతి స్మృతియై, చిర సంధ్యా దీపమై, అక్షరోత్సవ మండపాలలో సాహిత్య పోషణ. పండిత సన్మానాల సుగంధముతో వెలుగుచున్నది. మరణ మృణాలముపై ఉద్భవమైన అమ్లాన సాహిత్య పుండరీక మిది!

17-9-86,

నెల్లూరు.

# 14. భాషా సమితి

ఆశ్రమములో వల్కలములతో పెరిగిన శకుంతల నేడు యూనివర్శిటి రాజమహల్‌లో రాణియై ప్రవేశించినది. దుష్యంతుని రాణియై అడుగు పెట్టినది. పౌరాణిక దుష్యంతుడు మరుపు శాపమునకు బలియైన వాడు. నేటి దుష్యంతుడు మరులు గొన్న వాడు. ఆమె భవితవ్యము శుభ మగుగాక !

1947 వ సంవత్సరములో పుట్టిన సంకల్ప బిందువు రూపు రేఖలు దిద్దుకొని, స్తోమతు సమీకరణ చేసికొని, నదియై, స్రోతస్వినియై నేడు సాగర సంగమము చేయుచున్నది. ఇక నది కాన్పించదు. సాగరము తన అగాథ అంతఃపురములలో దాచి వేయును. విచ్చిన కరవాలములతో తరంగ రక్షకులే కాపలా కాయుచుందురు. ఇది క్షీరసాగరమే యగుగాక !

ప్రముఖుల ఆశీస్సుల, ఆదరముల, పండిత ప్రోత్సాహ సహకారముల పొందిన ప్రశస్త అరణములతో వచ్చినదే గాని, అప్పులతో కాదు. ఇక సమితి మీది. బలాత్కార అంగీకారముతో మేము దత్తము చేసిన వధువు కాదు. మీ ఆహ్వానమున మా ఐచ్ఛిక ఆశీస్సులతో ఈ సంయోగము ఏర్పడుచున్నది. పెంచినది మేము, పోషణ మీది. చేసిన దానికి మెరుగులు పెట్టండి. చేయని దానిని చేపట్టండి. పట్టు చీరెలతో అలంకరించండి. పరి

మళముల దశ దిశల వ్యాపింపనిండు. ఫలముల అందరినీ అనుభవింపనిండు. శైశవ లీలల మేము కండ్లార చూచి ఆనందించాము. యౌవన విలాసముల మీరు పులకితాంతరంగములతో తిలకింప వచ్చును. నైసర్గిక పరిణామమే గదా శైశవ యౌవన వీచికలు జీవన సాగరములో !

1926 లో పానగల్లు రాజా, మద్రాసు ముఖ్యమంత్రిగ ఆంధ్ర యూనివర్శిటీని స్థాపించిరి. 1986 లో శ్రీ రామారావు గారు ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రిగ తెలుగు యూనివర్శిటీని స్థాపించిరి. అది ప్రదేశానికి. ఇది భాషకు, సంస్కృతికి సంబంధించినవి. మధ్యలో 60 సంవత్సరాలు గడిచాయి. శ్రీ మోటూరి సత్యనారాయణ, నేను స్థాపక కార్యదర్శిగాను, అధ్యక్షునిగాను పని చేశాము. సంరక్షించుకొంటూ వచ్చాము. ఈ సమితి రథానికి శ్రీ మోటూరి ఇరుసు వంటి వాడు. చక్రాలు దానిని అంటే తిరుగుచుండినాయి. నేను రథానికి ధ్వజము వంటి వాడిని. కనపడేది ధ్వజము భారము వహించేది ఇరుసు.

మద్రాసు, ఆంధ్ర ప్రభుత్వాలు వలసిన సాయము చేసినాయి.

తర్వాత కేంద్ర ప్రభుత్వము సహాయము చేసినది. అన్ని ప్రభుత్వములతోను స్నేహాభిమాన సంబంధములే కాని, సంఘర్షణ భావము ఎన్నడూ కలగ లేదు. వారు మమ్ము కోరినదీ ఏమీ లేదు. మేము లేదన్నదీ ఏమీ లేదు. పని జరగడము, ఫలితము మాత్రమే అందరి లక్ష్యము.

అందరి ఆదర ప్రోత్సాహ పవనములతోనే తేలుచు వచ్చి తెలుగు యూనివర్శిటి రేవును చేరినది నౌక. సరియగు గమ్యస్థానమునే చేరినది.

ప్రశస్త, ప్రోత్సాహిత, పుణ్య చరిత!
ఆశీర్వాద అక్షతలు వేసిన ఎందరో మహానుభావులు!
అందరికీ వందనాలు !

స్థాపన: 15-10-1947 (మద్రాసు)
విలీనము: 15-10-1986 (హైదరాబాదు)

29-12-86,
మద్రాసు.

* * *

# 15. క్విజ్

మన దేశము మనకు పూర్తిగా తెలుసా ? భారతీయుల మని గర్వించుట తప్ప, దేశ అవగాహన పూర్తిగా ఉన్నదా ? భౌగోళిక జ్ఞానమే లేనపుడు, సాంస్కృతిక ఐక్యత ఎటుల ఏర్పడ గలదు ? ఎన్ని రకాల పువ్వులో ఈ తోటలో ? చూడండి, మన జ్ఞాన పరిమితి !

ఈ ప్రశ్నలకు జవాబులు ప్రయత్నించండి :

1. భారత దేశములో సంవత్సరాది ఎప్పుడు ?
2. అరుణాచల ప్రదేశములో భాష ఏది ? దాని లిపి ఏమి?
3. మిజోరాంలో, నాగాలాండులో ఏ భాష మాట్లాడుతారు ? లిపి ఏమి ?
4. రోమన్ లిపిని వాడే రాష్ట్రాలు ఏవి ?
5. భారత దేశములో విలీనము కాక పూర్వము సిక్కింలో ఏ భాష మాట్లాడుచుండినారు ? ఇప్పుడు మారినదా ? లేక అదేనా ?
6. అండమాన్, నికోబార్ దీవులలో ఏ భాషను ఎక్కువ మంది మాట్లాడుతారు ? ఏ లిపిని వాడుతారు ?
(వీని జవాబులు నాకూ తెలియనివే !)

29-10-86,

మద్రాసు.

# 16. అంజయ్య

స్వరాజ్యంలో 'స్వ' అంటే అర్థం 'మన'. మన రాజ్యం అంటే కొద్దిమందిది కాదు. రాజులు లేరు. జమీందారులిది కాదు. ఏ స్వార్థపరులిదీ కాదు. 'మన' అంటే ప్రజలమైన 'మన' మనే అర్థం. ప్రజాస్వామిక మనేదే! ప్రజాస్వామికములో చదువుకొన్న వారో, ఆస్తి కలవారో అధికారులు కాదు. కొంత విచక్షణా జ్ఞానము గల వారంతా సమానులే. వారిదే రాజ్యం. 21 సంవత్సరాలు నిండిన వారంతా వోటర్లే. వారిచేత ఎన్నుకోబడే వారే ప్రజా ప్రతినిధులు. వారే మంత్రుల ద్వారా పరిపాలన చేస్తారు.

స్వరాజ్యములో ప్రజాస్వామికము, ప్రతినిధుల ఎన్నిక, వారి పాలన అంతర్భాగములు. ఎన్నుకొన్న ప్రతినిధుల పాలన లేనపుడు, సైనికుల సాయముతో ఎవడో ఒకడు సర్వాధికారములు వహిస్తాడు. అతనినే డిక్టేటరంటారు. స్వరాజ్యం మాయమగుతుంది.

ప్రజాస్వామికములో ఊహించని విచిత్రాలు జరుగగలవు. అంటరానివానిగా ఉండిన సంజీవయ్య ముఖ్యమంత్రి అయ్యాడు. సదాలక్ష్మి దేవాలయాల మంత్రి అయ్యింది. ఆమెదీ అదే కులము. కాని సంజీవయ్య బి. ఏ. బి. యల్. చదివిన వాడని వాదించవచ్చును. పెద్ద చదువులు లేక కార్మికుడుగ జీవితాన్ని ప్రారం

భించి, కార్మిక నాయకుడై, కేంద్రములో కార్మిక మంత్రియై, రాష్ట్రములో ముఖ్యమంత్రి యైన వాడు అంజయ్య. ప్రజాస్వామిక ములో అపూర్వ దృష్టాంత మనే చెప్పొచ్చు. ప్రజాస్వామికపు మన్నులో ఎట్టి రంగుల, వాసనల పువ్వులు పూయగలవో ఎవరూ చెప్పలేరు. దాని సర్వతోముఖమైన శక్తిని కన్బరచే చిత్రము. సినిమాలో ఆడే రామారావు అధికార సోపానాల ఎక్కి, పై మెట్టున కూర్చొనడము ఒక అద్భుతమే. ఇట్టి అనూహ్యాలు, విచిత్రాలు ఎన్నెన్ని దాగియున్నవో! ఇదే ప్రజా స్వామిక విజయము. ఇట్టి శక్తి కలది కాబట్టే, స్వరాజ్యాన్ని కోరాము. తగిన త్యాగాలు చేశాము. వయోజన వోటింగ్ హక్కును తెచ్చుకొన్నాము. ప్రాతినిధ్య పరిపాలన స్థాపించుకొన్నాము. ఇట్టి ఏర్పాటే చిరకాలము వర్ధిల్లు గాక!

1-11-1986,

నెల్లూరు.

# 17. వావిళ్ల శత జయంతి

ఎంద రెందరి కృషి ఫలితాల వారసులమో మనము! 20 వ శతాబ్దము అదృష్టవంత మైనది మన తాతలు చూడని, తలచని విషయాలను చూస్తున్నాము, అనుభవిస్తున్నాము. రెండు ప్రపంచ యుద్ధాలు జరిగినా, స్థానిక యుద్ధాలు చెలరేగినా, లక్షల మంది రక్తము కారినా, కన్నీరు కార్చినా ఎంతో ప్రగతిని సాధించాము.

గత శతాబ్దాల భుజస్కంధాలపై ఎక్కి ఈ శతాబ్దము ప్రయాణము సాగిస్తున్నది ముందు శతాబ్దాన్ని ఆహ్వానించుచున్నది. ఇంకా ఎంత ప్రగతిని చూస్తుందో నేడు మనము ఊహించలేము. ఈ శతాబ్దములోనే మన దేశము విద్యుత్ శక్తిని చూచింది. పల్లెలకు ప్రాకుచున్నది. యంత్రాలను నడుపుచున్నది. పాతాళ గంగను పైకి తెచ్చుచున్నది. విద్యుత్‌శక్తి ఎన్ని రకాల మన సౌకర్యమునకు ఉపయోగ పడుచున్నదో లెక్కించ లేము. దీపాలు, ఫానులు, రేడియో, దూరదర్శనులు. యక్స్‌రే మున్నగునవి. రైళ్ళు నడుస్తున్నవి. శత ఉపయోగములకు ఆధారము విద్యుత్‌శక్తి. ఆ శక్తికి నమస్కరించ వలసినదే! దానిని కని పెట్టిన వాడు మహానుభావుడే !

అట్లనే అచ్చు యంత్రము ఎంత మార్పు తెచ్చింది—

విద్య వ్యాపించడానికి, విజ్ఞానము విస్తరిల్లడానికి! పుస్తకాలు, పత్రికలు లేని దినాలు ఊహించుకొంటే, ఎంత మసకలలో ఉండిందా మన సమాజము అని తలచక తప్పదు. మన ముత్తాతలు అచ్చు చూచి యుండరు. అంతా తాళపత్రాల మీద చెక్కడాలే. సంస్కృతాంధ్ర ప్రాచీన సాహిత్యము యావత్తు తాటాకుల మీదే! ఆ మసకల దినాలనుండి కాగితాల వెన్నెలలోనికి, అచ్చు వెలుగులోనికి వచ్చాము. లక్షలలో పత్రికలు, వేలలో పుస్తకాలు అచ్చగుచున్నవి. తోడనే దేశ విదేశములకు చనుచున్నవి నేటి కలిమినుండి ఆ లేమినాళ్ళకు మనస్సును త్రిప్పి నడిపించి చూడవలెను. కాల ప్రవాహములో ఎదురు ఈదితే కాని తెలియదు-వావిళ్ళ వారి సాహిత్య సేవ, బ్రౌన్ దొర అక్షరకృషి!

రామస్వామి శాస్త్రి పల్లెనుండి నెల్లూరు వచ్చి గోదావరి జిల్లాలకు పోయి సంస్కృతాంధ్రములలో పాండిత్యము పొంది, తాళపత్ర గ్రంథముల సేకరించి, ప్రచురణకై మైసూరు, మద్రాసులకు వెళ్ళి, సాహిత్య ప్రచారము చేయసాగారు. వారి మాతృభాష అరవ మైనా తెలుగునకు, సంస్కృతమునకు ఎంత సేవ చేశారు! ధనవంతుడు కాకపోయినా, అధికార బలము లేకపోయినా ప్రభుత్వ సహాయము దొరకక పోయినా, సాహిత్య క్రతువును ఉపక్రమించారు.

వ్రాత ప్రతులలోని వ్యత్యాసములను పరిష్కరించారు. టీకలు వ్రాశారు. వ్రాయించారు. అచ్చు మొదలిడినారు. అమ్ముడు పొయ్యే భారత, భాగవత, రామాయణాది గ్రంథములను అమ్ముడు పోని వేదాంత గ్రంథాలను, లక్షణ గ్రంథాలను ప్రచురించారు.

రామస్వామి శాస్త్రి దివంగతు లయ్యేప్పటికి, వేంకటేశ్వర శాస్త్రి ఏడు సంవత్సరముల వాడు. అయినా పెద్దవాడై తండ్రి

అడుగు జాడలలో నడచి, తండ్రి చేయనిపనిని చేసి పదింతలుగా సాహిత్య విస్తరణ గావించారు.

తెలుగు కావ్యాలకు టీకా తాత్పర్యాలు వ్రాయించారు. కొన్ని తమిళ గ్రంథాలను అనువాదము చేయించారు. నా చిన్న తనమున ఏ ప్రముఖ గ్రంథము కావలసి వచ్చినా వావిళ్ళవారి నుండి తెప్పించుకో వలసినదే!

శత జయంతి జరిపి, వారి సేవలు గుర్తించి, అకాడమీలు విశ్వవిద్యాలయాలు చేయని కార్యాలను చేసి చూపిన వావిళ్ళ తండ్రి కొడుకులకు వేయి నమస్కారాలు చేసి, ఋణము తీర్చు కొందాము. ఎందరో మహానుభావులు! వారిలో వావిళ్ళవారు చేరిన వారే! అందరికీ వందనాలు!

11-10-86,

**నెల్లూరు.**

# 18. దువ్వూరి రామిరెడ్డి

సొంత యత్నము చేతనే కవి అయ్యాడు. చిన్నగ్రామములో పుట్టి పెరిగాడు. అనేక ద్రోణుల ఏకలవ్య శిష్యుడైనాడు. గురు దక్షిణ అడుగని ద్రోణుల గ్రంథాలచే ప్రేరితుడైనాడు. పల్లె జీవితము, పొలాల వదాన్యత, రైతుల ఆనందాలకు కవితా కిరీటము తొడిగాడు. ఛందస్సు ఆభరణములచే అలంకరించాడు. కవిగా తెలుగునాట గుర్తింపు బడ్డాడు. తెలుగు నవ చైతన్యానికి మేల్కొలుపు పాటలు పాడాడు.

జామవా అంటరాని వారి, అడుగున నెట్టబడ్డ వారి గోడులు కవితావనములో ఘోషిస్తే, రైతు కవిగా రామిరెడ్డి కవితాధాన్యాల నూర్చేశాడు. కవికి పరిధులు లేవు. కవిగా రెక్కలు విప్పి కల్పనాంబరమున విహరించాడు. విశ్వశాంతి దిగంత శిఖరాలు తిలకించాడు. ప్రకృతి రమ్య చంద్రికలలో సాహిత్య కోరాలకు తృప్తిని కలిగించాడు. పర్షియన్ నేర్చి, ఖయ్యాము గగనాన హరివిల్లుగ మెరసిన తత్త్వాన్ని, వర్తమాన గౌరవాన్ని తెలుగు నాటను పానశాల కైపును ఎక్కించి శిరములు ఊగించాడు. ఆధునిక విజ్ఞాన ప్రసంగాల గుసగుసలను విన్నాడు. దానికి చకితుడై ప్రతిధ్వనించాడు.

అనువాదకుడై సొంత కవితల భాషాంతరీకరించాడు. నిగర్వీగ మాటలలో పొదుపును చూపాడు. ఏబది రెండు

సంవత్సరములే దేహ మురళిని పలికించాడు. స్వాతంత్ర్య పూర్ణిమకు మురిశాడు. వెంటాడే అమావాస్యకే కన్నుమూశాడు. తాను చిత్రించుకొన్న స్వప్నముల కాంచుటకే చిర నిద్రను ఆహ్వానించాడు.

స్మారక సభలలో మేల్కొన్నాడు. సాహిత్య పరులును, విజ్ఞాన వేత్తలును కర్పూర హారతుల పట్టుచున్నారు— అతని జన్మ దినాన

రైతుల ఆనంద హాసముల స్తుతించాడు. ఉమర్ ఖయాం మొలకను తెలుగు కవిత పంట చేలల్లో నాటాడు.

దేశ మాతను స్తుతించి, ఉత్తేజ పరిచాడు.

13-11-86,

మద్రాసు.

# 19. వాద్యాలయము

సృష్టిలోని మానవుని శిష్టత అనేక రూపాలలో పుష్పించింది. మాట్లాడుతాడు. ఆలోచించి మాట్లాడుతాడు. జ్ఞాపకముంచుకొని మాట్లాడుతాడు. తన మనో భావాలను వ్యక్తము చేయడానికి భిన్న రసాలను ప్రదర్శిస్తాడు. ఏడుస్తాడు. నవ్వుతాడు, కూత వేస్తాడు. పాడుతాడు. చిందుల త్రొక్కుతాడు.

నేర్పుతో అనేక రాగాలలో లయలతో పాటల పాడుతాడు. ఇవన్నీ తన గాత్రానికి సంబంధించినవి. జడ రూపములో నున్న వస్తువులనుండి సంగీతము పుట్టిస్తాడు. వెదురును వేణువు చేస్తాడు. తీగెలతో వీణను పలికిస్తాడు. చర్మాలతో మృదంగము చేసి వాయిస్తాడు కర్రలతో కొట్టే డప్పులు చేస్తాడు. వ్రేళ్ళతో పలికించేవి, ఊదేవి, కర్రతో కొట్టేవి. కమానుతో వాయించేవి. కంజీరా, మోర్సింగు, ఘటాలు వీనిలో చేరినవే సంగీతమో, దానికి ఉపయుక్తమయ్యే సామాగ్రిని పుట్టిస్తాడు. గాత్ర సంగీతానికి అవి దాసీలుగ పనిచేస్తాయి. కొన్ని సొంతముగా సంగీతమును వినిపిస్తాయి.

శతాబ్దాల వికసనములో సంగీత సామ్రాజ్యము ఎంత విస్తరిల్లింది. ఊహించని నందన వన వీథులలో విహరించింది. మాటలు చిందని రసమును చల్లింది. మాధుర్యపారావారాన్ని

పొంగించింది. ఎన్ని ఆరోహణలు, అవరోహణములు! ఎన్ని అలాపనలు! లయలు! నవ నవ నాద స్తోత్రముల ఊరించింది. మాటలు సప్తస్వరాలై పులకరించాయి. క్రొత్త వర్ణములతో గుబాళింపులతో మాధుర్య మనోహరత్వాన్ని ప్రకటించాయి. లౌకిక మగుమాటకు అలౌకిక మగు నైపుణ్యమును చేర్చి, సంగీతానికి నృత్యాన్ని జోడించి ఆనంద రస సింధువును సృష్టించాడు మానవుడు.

మన దేవతలు కొన్ని వాద్యములతోనే కనిపిస్తారు. సరస్వతికి ప్రాణము వీణ. కృష్ణునికి భూషణము వేణువు. శివునకు డమరు, శుభ కార్యములకు నాదస్వరము, సమరానికి దుందుభి, శంఖము. రాజు రాకకు తూర్యాలు, నృత్యానికి గజ్జెలు, పూజకు గంట.

శతాబ్దాలలో ఎంత సంగీత సామగ్రిని కూర్చుకొన్నాము. కొండ జాతులవారు ఉపయోగించే సామగ్రి వేరు. భిన్న ప్రాంతాలలో, భిన్న సన్నివేశములకు వేరువేరు సంగీత సామగ్రి క్రొత్తవి చేరుచున్నాయి. పాతవి మూల పడుచున్నాయి. ఒక్కొక్క వాయిద్యము రూపాంతరము పొంది క్రొత్త రూపములో కాన్పించును. వంశవృక్షము క్రొత్త పువ్వులు పూస్తుంది. పాతవి రాల్చేస్తుంది. పెద్ద సంపదగా పెరిగింది. కొన్ని లుప్తమై పోయాయి. దేశములో మరెచ్చట లేని వాద్యాలయం మద్రాసులో కేంద్ర ప్రభుత్వం స్థాపించింది. రెండు వందలకు పైగా వాద్యాల సేకరించి పెట్టారు. పాత నుండే క్రొత్తను మలచడానికి పరిశోధనలు చేస్తున్నారు. ఆశ్చర్యము, వినోదము కల్గించేదే ఈ వాయిద్య ప్రదర్శనశాల, పరిశోధన శాల!

కర్ణాటక సంగీత శాస్త్రము శతపత్రముగ వికసించింది. రాగాలకు ఎన్ని మధురమైన నామధేయాలు. అమృతవాహిని.

మలయమారుతము, కదన కుతూహలము మున్నగునవి. 72 మేళకర్తలుగ విభజన చేశారు. అసంఖ్యాకములైన జన్య రాగాలు, నృత్యానికి అనువగు రీతులు! ఇంత విభిన్నత్వం గల సంగీత శాస్త్రము మరెచ్చటను లేదేమో! మహా విద్వాంసుల అమోఘ కృషికి మనము నేడు వారసులము. అదే మన ఆనంద గర్వ కారణము.

15-11-86,

మద్రాసు.

# 20. వృద్ధ దంపతులు

## I

ఆయన పెద్ద ఉద్యోగము చేసి, పదవీ విరమణ పొందాడు. భార్య అనుకూలము. సొంత కార్యాలలో సలహాల నిస్తూ, సపర్యల చేస్తూ పరస్పర ప్రేమానురాగాలతో జీవితము గడిపేవారు.

చాలా నాళ్ళ రోగాలు ముగ్గి పండైనవి. అపర వయస్సులో జబ్బుచేసి రెండు కండ్ల చూపులు పోయాయి. ఆమెకు నిస్పృహ వేసింది. ఆయన ధైర్యం చెప్పేవాడు. ''చూడవలసిన వన్నీ చూశావు. కాశ్మీరము నుండి కన్యాకుమారి వరకు రమ్య ప్రదేశాలను, మందిరాలను చూచావు. మనవళ్ళను, మనవరాళ్ళను పెంచావు. క్రొత్తలోకాన్ని సృష్టించుకో, ఊహానేత్రాలు తెరుచుకో. నీకేమి కొదవ?'' అని ఓదార్చేవాడు. ముందు ఎంత అందంగా అలంకరించుకొనే దానవో, అట్లనే అందంగా ఉండాలి. నీ రవల కమ్మలు, రవల గాజులు అట్లనే ఉండాలి. ఉదయాన్నే బీరువా నుండి మంచి చీర, రవికె తనే ఏరి, స్నానాలగదిలో పెట్టేవాడు. ''మధురలో కొంటివే పట్టు గళ్ళ చీర, కూతురు పెండ్లికి కొంటివే బెనారసు చీర, నీ స్నేహితురాలిచ్చిన పచ్చని చీర'' అని వర్ణన చేస్తూ ఏరి పెట్టేవాడు. ''నేను ధరించేది నా కొరకు కాదుగా, మీ కొరకు, మీ అందరి కొరకు'' అని ముస్తాబయ్యేది. స్నానముచేసి

పూజాగృహములో పూజ చేసుకొని వచ్చేవరకు వేచియుండి, వడ్డించి తాను ఫలహారము చేసేవాడు. అట్లనే భోజనాలు! రేడియో గ్రామ్‌ఫోన్ సెట్ల సంగీతము వినిపించేవాడు ఏమీ లోటు లేకుండా శ్రవణ లోకములో అన్నీ చూస్తూ, ఆనందముగానే ఉండేది. సాయంత్రము ఒక ఘంటసేపు సముద్రతీరములో కొంత దూరము నడచి కూర్చొని లోకాభిరామాయణము మాట్లాడుకొని వచ్చేవారు. ఎప్పటి వలెనే అలంకారాలు, మందులు, సంగీతాలు, యింటి ఏర్పాట్లు జరిగేవి. వారి చెలిమి ముదిరి రంగు తాల్చింది. సువాసనల చిమ్మింది. అప్పు డప్పుడు చుట్టాలు, స్నేహితులు వచ్చి చూచేవారు. భర్త శ్రద్ధను, భార్య ఉత్సాహాన్ని చూచి అందరికీ ఆనంద మయ్యేది. ఆమె నిస్సహాయత ఆమెకు మధురమైన క్రొత్త లోకాన్ని సృష్టించింది.

## II

అందరు ఆడవాళ్ళు భర్తల ముందే సుమంగళులుగా చనిపోవాలని కోరుకొంటారు. వైధవ్యము రాకూడదని వాంఛిస్తారు. ఆమెకు అట్టి భావన లేదు. ఆమె ముందుపోతే ఆమె భర్తగతేమి? ఆయనను ఎవరు చూస్తారు? అనేది. "ఏమి వైధవ్యము వస్తే, పెండ్లి పేరంటాలకు పోలేము, అంతే గదా!" అనేది. "ఆయన జీవించినంత కాలము సుఖముగా జీవించాలి, ఎట్టి ఇబ్బందులు ఉండకూడదు. ఆయన సేవలు చేస్తూ లోటేమీలేకుండ చెయ్యడము నా ధర్మము, కర్తవ్యము" అనేది నిబ్బరంగా.

ఆయన సుఖమా, నా స్వార్థమా అని ప్రశ్నించుకొనే ఆ నిర్ణయానికి వచ్చింది. అట్లనే సేవలచేసి సంతసించేది. అన్యోన్య అనురాగాలతో దంపతులు జీవించారు, తృప్తితో మెలిగారు.

# III

ఆయన పెద్ద వయస్సులో, భార్య కొద్దినాళ్ళ జబ్బుతో చనిపోయింది. ఎదురు చూడని వియోగము. సమ్మెట పోటు వలె పడింది నెత్తిమీద. కొడుకు, కోడలు చూస్తున్నారు- జాగ్రత్త గనే!

కాని ఏ కొద్దిపాటి అనారోగ్యము కలిగినా, నర్సింగ్ హోంలో చేర్చుచున్నారు. భార్య ఉండగా, నర్సింగ్ హోం గడప ఎక్క లేదు. ఆమే మందు లిచ్చేది ఆహారము సమయానికి తెచ్చేది. పడక బట్టలు సర్దేది. అవసరమైనపుడు కమోడు కూడ ఆమే కడిగేది. ఏ పని చేసినా, సంతోషముగ ఆదరముగ చేసేది. విసుగు గాని, జుగుప్స గాని ఆమె ముఖమున ఎన్నడూ కాన్పించేది కాదు. ఆప్యాయతతో పనులు పూర్తి చేసి ప్రక్కన వచ్చి కూర్చొనేది. నవ్వులతో పలుకరించేది.

కొడుకు ఉద్యోగి, కోడలు మంచి అమ్మాయే, నిదానమైనదే, కాని కోడలు కోడలే! పరాయి ఇంటి అమ్మాయే! మామ వద్ద ఆమెకు చనవు తక్కువ. ఆయన బట్టలు, పడక సవరించ లేదు. స్నానము చేయించలేదు. ఖర్చు అయినా, నర్సింగ్ హోమే అతనికి శరణ్యము, జబ్బు చేసినపుడు. భార్య జ్ఞప్తికి వచ్చేది. అనురాగ పూర్వకమైన ఆదరణ స్మరణకు వచ్చేది; కన్నులు చెమ్మగిలేవి. ఎప్పుడైనా, కన్నీటి బొట్టు ఒకటి జారి పడేది. ఆప్త మిత్రునితో, మారిన స్థితిని గూర్చి దీనంగా చెప్పుకొనే వాడు.

ఇట్టి అనురాగ సన్నివేశాలు ఎన్నెన్ని జీవన రంగములో! ఇందు బలాత్కారం ప్రమేయ మేమీలేదు. ఐచ్ఛికముగ సంతోషంగా జరిగే మధుర సంఘటనలు!

'ప్రేమే సత్యము. ప్రేమే దైవము' అన్నారు మన పెద్దలు. ప్రేమ అలౌకికము. అంతకు మించిన దైవ మేమున్నది? ఈ సంక్షుభిత సంసార సాగరములో ప్రేమే రేవు. ప్రేమే తెర చాపలు. ప్రేమే తెడ్డు. ప్రేమే చుక్కాని. ప్రేమే నావికుడు!

27-11-86,

నెల్లూరు.

# 21. సమరాలు - సంహారాలు

'అహం బ్రహ్మ' అంటాడు మానవుడు. ప్రగతి పథములో సోపానాలు ఎక్కుచు నూతన వాతావరణములో వికసించుచున్నా నని అంటాడు. నిక్షిప్తమైన నైసర్గిక రహస్యాలను వెలికి తెస్తున్నానని అంటాడు. ఆత్మస్తవము కావచ్చును. వాస్తవాలు కావచ్చును. కాదనలేము. మానవుని తక్కువ పరచిన లాభమేమి ?

కాని మానవుడికి సహమానవు డంటే శ్రద్ధ లేదు. కరుణ లేదు. ఏదో నెపముతో, ఏ చిన్న కారణముతో నైన రణానికి దిగుతాడు. కలహాన్ని ప్రోత్సహిస్తాడు. మనకు విదితమైన చరిత్రలో పుటలు తిరగవేస్తే, ఎన్ని చిన్నా, పెద్దా యుద్ధాలు జరిగినవి. ఏ శతాబ్దములో నైన నర రుధిర స్రవంతులతో, తన క్రౌర్య ముఖమును చూచుకొనుట మానినదా ? శవ చితానల ధూమముల మూర్కొనక మానినదా ? ఏమి ఈ వైపరీత్యము ! ఎంత నిష్ఠుర రుద్రలీల ! భారత రామాయణాది గ్రంథాలలో యుద్ధ పర్వాలు, యుద్ధకాండలు లేక ఉన్నాయా? రాజ కుమారులకు శాస్త్ర విద్య నేర్పారో లేదో కాని, శస్త్ర విద్య తప్పక నేర్పేవారు. అర్జునుడు, అభిమన్యుడు కావ్య పఠన చేశారో లేదో కాని, కార్ముక విద్య బాగా నేర్చారు. రాముని పెండ్లి, అర్జునుని పెండ్లి ధనుస్సుల నేర్పుతోనే జరిగాయి. రామ లక్ష్మణులు విశ్వా

మిత్రుని వద్ద నేర్చింది అదే. పరిచిత సహస్రాబ్దాలలో ఎన్ని కోట్ల మంది సమరాలలో చనిపోయారు? వీ రందరూ వీర స్వర్గము చేరబట్టే స్వర్గము కూడ ఇరుకై పోయినది.

శుభానికి, అశుభానికి ఓం శాంతిః, శాంతిః, శాంతిః అంటు న్నాము. శాంతి కరువైనది కాబట్టే దానిని ఆహ్వానిస్తుంటాము. అన్వేషిస్తున్నాము. అది ఎచ్చటో రక్త సిక్త పర్దాల వెనుక దాగి యున్నది. మాయ మైనదా, దాచబడినదా ? ఈ నాడు ఎన్ని వేల కోట్ల రూపాయలు ప్రతి వత్సరము సమర పరికరాలకై వెచ్చించుచున్నారు ! ఇంకొక వైపు ఎన్ని శాంతి నినాదాలు, ఉత్సవాలు, సమావేశాలు ! ఎవ్వడూ యుద్ధము కావాలని కోరడు. అందరూ, దానికై కండరాలను పెంచుకొంటూనే యున్నారు. 'శాంతము లేక సౌఖ్యము కలదా'? అని ఊరకనే అన్నాడా త్యాగబ్రహ్మ? శాంతి లేదు, అంతా సమరమే, సంహా రమే. ఎంత నర రక్తము భూమి ముఖముపై చింది జుగుప్సను రోతను పుట్టించిందో! నరుడు శాంతి కాముకుడా ? కదన కుతూ హలుడా ? ఎంత వేడి నెత్తురు, ఎంత కన్నీరు కార్చి, భూమిని పంకిల మొనర్చినాడో! ఇదేనా 'అహం బ్రహ్మ' అనే మానవుడు చేయవలసిన పని ?

అశోకుని ధర్మ చక్ర మంటాము. దాని అడుగు నీడ లలో ఎన్ని శవాల రుధిరము ఒరిస్సా నదీ జలాల అరుణ మొనర్చినదో, కలుషిత మొనర్చినదో తలచామా ! ఆ దారుణ, ఉన్మత్త రక్త తరంగాలు చూచి అశోకుని క్రోధానలము శాంతించి బుద్ధుని చరణాలను శరణు వేడి ధర్మచక్రాన్ని తయారుచేసి, స్థాపించాడట!

మానవుని నొసటిమీద వ్రాసిన గీతలు, బ్రహ్మ నర రక్త ముతో ముంచిన పేనాతోనే వ్రాశాడా ? రుధిర స్నానము చేసి

ఉల్లాస పరుడై, లేక ఉన్మాద వశుడై నొసటి గీతలు వ్రాశాడా? బ్రహ్మ నిర్మించిన 'అహంబ్రహ్మ' అనే మానవుడు ఈ రుద్ర క్రీడల సల్పుచున్నాడు. తెలియని ఆ నాటినుండి, తెలిసిన ఈ నాటి వరకు మానవుని హస్తములు రక్త సిక్తములే, రుధిర అరుణితములే! నాలుక మాత్రం "ఓం శాంతిః, శాంతిః, శాంతిః" అని జపము చేస్తూంటుంది. శాంతి శపథముల ఉచ్ఛరించుచునే యున్నది.

27-11-86,

నెల్లూరు.

# 22. ఛలోక్తుల ఆట

చిన్న విషయాలు వేసిన ఆనంద ముద్ర పెద్ద విషయాలు వేయలేవు. పెద్దవి బెలూనులు. గాలితో నిండి యుంటాయి. చిన్న విషయాల్లో అసలుదే. రెండవ దానికి తావు లేదు. పెద్ద వాని కన్న చిన్న పాపడే ఎక్కువ ముద్దుగ ఉంటాడు పెద్ద పాటలో చిన్న చరణము ఆహ్లాదము నిస్తుంది.

ఆమెతో పరిచయము తక్కువ. ఒకటి రెండు సారులు సభలలో కలిసినా నేమో ! మిత్రుని ఇంట కలిశాము. ఒక అమ్మాయి నాట్య ప్రదర్శనకు రమ్మని పిలువడానికి వచ్చింది. నన్ను చనవుతో పలుకరించింది. ఎక్కడ ఎన్నడు కలిశాము? వారి బంధువుల పేర్లను, ఊర్ల పేర్లను అడిగింది. చాల వరకు సమాధానాలు సరిగానే చెప్పాను. ''ప్రశ్నల వర్షము వెలిసిందా'' అని అడిగాను. ''హై సెకండు క్లాసు కాదు. గుడ్ ఫస్టు క్లాసే వచ్చింది'' అని నవ్వింది.

ఆ సాయంత్రము ఆమె అందముగ కాన్పించింది- మంచి వేషముతో తగిన అలంకారముతో ! విప్పారిన ముఖముతో చలాక్షి మాటలతో, నవ్వులతో శుక్లదశమి చంద్రుని వలె తళతళ లాడింది. అందము, నేర్పరితనము జోరుగ నడిచాయి.

తలవని తలంపుగ కలియడము, నృత్యానికి రమ్మని ఆహ్వానించడము, ప్రశ్నలు, ఉల్లాసము నన్ను సంతోషపెట్టాయి. ఆనందము హృదయములో ముద్రిత మయ్యింది. మామూలు కన్న ఆ సాయంత్రము అందంగా కన్పించింది. సౌందర్య మయూరము పింఛం విప్పినట్లుగ ఉండింది. ఏదో తెలియని నేర్పు, ఉత్సాహము నన్ను విస్మిత పరిచింది. రమ్మన్న సమయానికి ముందుగనే నాట్యశాల చేరాము. ఆమె స్వాగత మిచ్చింది. ''నాట్యము కన్న మిమ్ము చూడడానికే వచ్చాము'' అన్నాను సన్నగ. ''నన్ను చూచారు గదా, ఇక నాట్యం చూడండి'' అన్నది నవ్వుతూ. ''బహుమతి యిచ్చాకనే ప్రశ్న పత్రములో నెగ్గినా రన్నారు గదా! నే నడిగే ప్రశ్నలకు జవాబిస్తారా''? అన్నాను. ''ఏ విషయము మీద అడుగుతారు'' అన్నది. ''మీరు ముందుగనే చెప్పారా? చెప్పకనే అడిగారు గదా!'' అన్నాను. ''సరే అడగండి, పరీక్ష అవుతానో లేదో చూస్తాను. నాట్యం కానియ్యండి'' అన్నది.

''కన్నడము బాగా వచ్చునా?'' అని అడిగాను. ''కోపపడ గలను. తిట్టగలను'' అన్నది. ''తెలుగులో కన్నా కన్నడములో తిట్లు ఎక్కువ ఉన్నాయా? ఆ లెక్కలు నాకు తెలియవండి. బెంగాలీ వాళ్ళు కూడా తిట్టాలిసి వస్తే హిందూస్థానీని ఉపయోగిస్తారు. బహుశా ఆ భాషలో తిట్లు ఎక్కువ ఉన్నాయోమో!'' అన్నాను. ''నీకు పరిచయము ఎక్కువ తెలుగా, కన్నడమా'' అని అడిగాను. "మాతృభాష తెలుగే. కాని రెండూ అంతంత మాత్రమే! చెప్పుకో తగ్గ పాండిత్యము లేదు" ''యం. ఏ. ఏ శాస్త్రములో?'' ''ఇంగ్లిష లిటరేచర్‌లో. మంచి మార్కులతోనే ప్యాసయినాను'' అన్నది. మిగతా ప్రశ్నలు నాట్యం తర్వాతనే అన్నాను.

ఆ విధముగా ఆత్మీయత ప్రారంభము. తర్వాత కొన్నాళ్ళకు "నా పరీక్షలో నీవు నెగ్గావు. నీ పరీక్షలో నేను నెగ్గాను గదా!'' అన్నాను.

''నీవు ఇవ్వనిది నేను ఇస్తున్నాను'' అని అక్కున చేర్చుకొన్నాను,— ఆనందముతో, ఆప్యాయతతో, ఆదరముతో.

ఆమె సంతృప్తితోనే నవ్వింది- ''మంచి బహుమతే నండీ!'' అంటూ.

12-1-87,

**నెల్లూరు.**

# 23. ఎందరో చతురభాషిణులు అందరికీ పరిరంభణాలు

"ఎందరో చతుర భాషిణులు!
అందరికీ పరిరంభణాలు!"

అని ఉల్లాసముతో మనమును ఊహించుకుంటూ వేణుగానము చేసేవాడు కాబోలు బృందావన రస చక్రవర్తి.

అందరినీ ఆకర్షించేవాడు
ఛలోక్తులతో, సల్లాపాలతో!

అందమైన ముఖారవిందాలతో చుట్టూ మూగగా అందరినీ పలుకరించి మందహాసాలు చేసి, స్పృశించి ఆనంద భ్రమరమై గంతు లిడేవాడేమో!

బృందావనము సంతోష మకరంద సరోవరముగ మారి పోయేదేమో! అప్రకటిత మనోరథాలు, దాచుకున్న ఉద్వేగాలు, రసపూరిత స్వప్న దృశ్యాలు రూపాంతరము పొంది, వనమున చిగురుటాకులుగా, చిరుమొగ్గలుగా, మంచున తడిసిన పువ్వులుగా పిల్లగాలుల అలలుగ కాన్పించేవేమో! రస సమ్రాట్టుకు తెలుసు వన రహస్య మర్మాలు. రంగుల వల్ల, వాసనల వల్ల గుర్తించే వాడు వాని వాస్తవ స్వరూపాలను. అంతరంగ ఉల్లాసము, వేదన ఎన్నడూ బయట పడవు. పుష్పమును పరిమళము వలె, లేక కీటకము వలె లోలోన విహ్వాల పరచుచుండును. అదే ప్రేమలోని

మధుర వేదన. పైకి కిలకిలలాడే పిట్టల వలెనే అగుపడుతారు ఆ మగువలు. కాని బూడిద కప్పిన నిప్పు కణాలను దాచుకొన్నవి వారి భిన్న హృదయాలు. అణచి దాచుకున్న శృంగార వాంఛలు, రసభరిత ఉద్వేగాలు, ఉద్రేకాలు కొన్ని నయనాలలో, ముఖ ఫలకాలలో, కపోలాలలో అడుగు జాడల వదలే వెడలుచున్నవి. ఏకాంత తిమిరాలలో మనోరంగములో కోర్కెలతో పోరులు సల్పి అనిద్రా ముద్రలతో, నిశీథ క్లాంతములైన మ్లాన ముఖాలతో నిస్సహాయలుగ కాన్పించెదరు. వారి నిర్ణయము, సహజ ప్రవృత్తి ప్రవాహమునకు ఎదురీత! ఒంటరితనము కల్లోల పరచు చుండును.

కృష్ణుని సరస సల్లాప సభలకు హాజరగు వారు భిన్న ప్రవృత్తుల వారు. వివిధ అనురాగాలతో శ్రద్ధలతో ప్రేమ కర్పూరముల మది పళ్ళెరములలో వెలిగించుకొంటూ వస్తారు. కొందరు పరితృప్తితో వెడలుతారు. కొందరి పరివేదన తీవ్ర మగుతుంది. వారు స్వైరిణులు కారు. అభిమాన ఆత్మీయులు. వారు ఆసీనములైన పులినాలు స్మతి చిహ్నాలుగ కటి ముద్రలను పదిలముగ దాచుకొనుచున్నవి. పదాంకములు, హస్తాంకములు కొంత కాలము జ్ఞాపక స్తంభములుగ నిలిచే యున్నవి.

సభా సమాప్తము, వీడ్కోలుపు ప్రదర్శన శాల! ఒక్కొక్క వీడ్కోలుపు ఒక్కొక్క నిట్టూర్పు. ఆ నిట్టూర్పులచే వారి కర్పూర హారతులు ఆరిపోవు. వాని వెలుగులు, వాని కమ్మని తావుల పొగ గొలుసులు స్మృతి దీపములుగ ఆరని జ్యోతులైనాయి.

చతుర భాషిణులకు ఆ సల్లాపి నట వరుడు అనురాగ భ్రాంతిని కలిగించు నాగరుడు. మనోహర శృంగార నటనా

కళా ప్రపూర్ణుడు, రోమాంచిత మొనర్చు రసోద్దీపిత ప్రవీణ వల్లభుడు.

మురళీ మోహనుడు ఎన్ని మధురస్మృతి తులసీ మాలల వహించినవాడో! మందహాస మందార మాలల ధరించిన వాడో! ఉద్విగ్న హృదయాల నిశ్వాస వింజామరల కాంచినవాడో! ఏకాంత సేవా పరాయణల సరసాలచే కల్లోల పెట్టిన వాడో!

25-4-87,
నెల్లూరు.

# 24. రామ కుట్టి నాయర్

ఆమని తోటకు కోకిల వలె నా మంత్రిత్వపు సిబ్బందిలోనికి వచ్చాడు రామకుట్టి. ఎట్లా వచ్చాడో, ఎవరి ద్వారా వచ్చాడో తెలియదు. మలబారు జిల్లావాడు. 18 సంవత్సరాల కుర్రవాడు. మా ఇంట్లోనే బస, భోజనము. మా మూడేళ్లబ్బాయికి స్నేహితుడయ్యాడు. ఆడుకొనేవాడు. అన్నం తినిపించే వాడు. స్నానం చేయించేవాడు. తల దువ్వేవాడు.

ఉదయం కొద్ది సేపు నన్ను చూడటానికి వచ్చినవారి చీటీలు తెచ్చి యిచ్చేవాడు. అబ్బాయి వెంట నడుస్తుండగా, రామకుట్టి ఎప్పుడూ ఉల్లాసంగా ఉండేవాడు.విసుగుదల అడుగుల అతని ముఖఫలకమున ఎన్నడూ కాంచలేదు.ఎప్పుడూ శుభ్రమైన బట్టలధరించి అప్పగించిన పనిని నిమిషాలమీదచేసి వచ్చేవాడు. నా ప్రయాణపు సన్నాహాలు చేసి, సామాన్లు కారులో ఉంచేవాడు. తిరిగి రాగానే కారు ఆగగానే సామాను ఎచ్చట ఉంచాలనో, అచ్చటనే పెట్టేవాడు. ఇంటివద్దనే పని. నేను ఆఫీసుకు పోగానే, తీరికగా అబ్బాయితో ఆడుకొనేవాడు. వచ్చీ రాని అరవములో తెలుగు మాటలు చేర్చి కథలు చెప్పేవాడు. ఇంటి సభ్యుడుగానే ఉండేవాడు. అందరికీ ఇష్టుడు రామకుట్టి. ఎప్పుడైనా తన వంతు వచ్చినపుడు క్యాంపుకు తీసుకపొయ్యేవాడిని, అబ్బాయి నిదురించే

టప్పుడు. తిరిగి వచ్చేవరకు 'రామకుట్టి ఎప్పుడు వస్తాడు'? అని తల్లిని పదేపదే అడిగేవాడు. అబ్బాయికి సమాధానాలు ఇయ్యలేక నా భార్యకు విసుగు పుట్టేది. రామకుట్టి లేకుండ ఇల్లు శూన్యంగా ఉండేది మా అబ్బాయికి.

మలబారులో ఏ కుగ్రామము వాడో ! కొద్ది చదువు. మద్రాసుకు నౌకరీకి వచ్చి మా అబ్బాయికి పరమ ఆప్తుడయ్యాడు. మా అందరికీ విశ్వాస పాత్రు డయ్యాడు. మంచి నౌకరు దొరకడం చిన్న విషయమైనా, అదృష్టాలలో ఒకటని చెప్పొచ్చు.

పెళ్లిళ్లకై పది దినములు ఊరికి పోవాలని ప్రయాణకార్యక్రమము నిర్ణయించుకొన్నాము. అనుకొన్న తేదీకి రెండు నాళ్ళ ముందర రామకుట్టికి జ్వరం వచ్చింది. డాక్టరు రెండు పూటలూ వచ్చి పరీక్షించి మందునిచ్చాడు. నేను అతని గదికి వెళ్ళి విచారించి వచ్చేవాడిని. నా భార్య డాక్టరుతో కూడా వెళ్ళి, ఎట్లా ఉందో ఏమి తీసుకొంటాడో తెలిసికొని వంపేది రామకుట్టి అట్లా పడి ఉండడం చూసి భయపడేవాడు అబ్బాయి. అమ్మచాటునే దాగి, కుట్టిని చూచేవాడు. ఏమీ తోచక ఊరక తల్లివద్ద కూర్చునేవాడు. డాక్టరుతో రెండు పూటలూ వచ్చి చూచి జాగ్రత్తగ చూడమనీ, గుమాస్తాతో ప్రతి సాయంత్రము ఎట్లా ఉన్నదో నాతో ఫోనులో మాట్లాడమనీ ఏర్పాటు చేసి, నెల్లూరికి కారులో వెళ్ళాము.

రెండవ నాడు జ్వరము తగ్గినదని, కాఫీ అడిగాడని గుమాస్తా తెలిపాడు. సంతోషించాము. ఐదవ నాడు హఠాత్తుగ టెలిఫోను వచ్చింది. జబ్బు రిలాప్సు అయింది. జ్వరము 105

డిగ్రీలకు పైగ ఉన్నది. సీరియస్‌గానే ఉన్నది. పెద్ద డాక్టరుతో సంప్రతించి మంచి మందులనే వాడుచున్నాడని గుమాస్తా తెలిపాడు. సాయంత్రము మళ్ళీ ఫోను చెయ్యమని చెప్పాను. సాయంత్రము మరలా ఫోను. రామకుట్టి 4–15కు చనిపోయాడు. రేపు ఉదయము దహనము ఏర్పాటు చేస్తున్నామని తెలిపాడు. రెండు నిమిషాలు నేను మాట్లాడ లేకపోయాను. నెమ్మదిగా నా భార్యవద్దకు వెళ్ళి రామకుట్టి చనిపోయాడు. రేపు ఉదయము దహనమని గద్గదకంఠముతో చెప్పాను. 'హరిహరీ!' అంటూ కంట నీళ్ళు పెట్టుకొన్నది. మాట్లాడ లేకపోయింది. ఇతర పిల్లలతో ఆడుకొంటున్న అబ్బాయితో చెప్పవద్దని చెప్పాను.

అనుకొన్న తేదికి మద్రాసు చేరాము. ఇల్లు చేరగనే మామూలుగ వచ్చి సామాన్లు దింపే రామకుట్టి లేడుగదా! ఇంకొక నౌకరు కన్పించినాడు నేను మౌనంగా ఆఫీసు గదిలోనికి వెళ్ళాను. ఆ క్రొత్త నౌకరును చూడగానే నా భార్య దుఃఖాన్ని ఆపుకోలేక ఏడుస్తూ కారు దిగింది. మెట్లు ఎక్కలేక, మెట్లమీద కూర్చున్నది. కన్నీరు తుడుచుకొంటూ. ఎవరి సాయము చేతనో 'రామకుట్టి రామకుట్టి' అంటూ తన గదిలోనికి వెళ్ళి మంచము మీద వాలింది. అబ్బాయికి ఏమీ అర్థము కాలేదు. 'రామకుట్టి ఏడి?' అని అడిగాడు. అందరూ నిశ్శబ్దముగా ఉండిపోయారు.

ఊరిలో ఉన్న తండ్రికి తెలిపి, ప్రతి నెలా ఎంత పంపుచుండినాడో అంత సంవత్సరం పాటు పంపి, తండ్రిని పిలిపించుకొని, వారము దినము లుంచుకొని, యింకొక సంవత్సరపు మొత్తాన్ని యిచ్చి యింటికి పంపినాము.

అబ్బాయి కొంత కాలము "రామకుట్టి రాడా"? అని అడు

గుతూ వచ్చాడు.

1951వ సం పు ఉదంతాన్ని వాస్తవ చిత్రంగా గీచాను.

22-5-87,

నెల్లూరు.

# 25. స్వల్ప ఉదంతాలు

స్వల్ప ఉదంతాలు ఒక్కొక్క వేళ భవిష్యత్తు సౌధానికి పెద్ద పునాదులు! జీవన స్రవంతికి గొప్ప మలుపులు! బాల చంద్రుని వలె ఎన్నో కళల సొగసులను దాచుకొని ఉంటాయి.

హిమాలయాల్లో ఒకే పర్వతపు తూర్పు చెంపన పడిన వానచుక్క బ్రహ్మపుత్ర నదిలో చేరి, భారత బంగ్లా దేశాలకు పారుచున్నది. పడమటి వైపున వాలిన చుక్క సిందునదియై కాశ్మీరు పాకిస్థానులకు పరుగిడుతుంది. స్వల్పములోనే అనల్పములైన వ్యత్యాసాలు, విపరీతాలు! సంగీతములోను సాధారణ గాంధారము బదులు అంతర గాంధారము పలికితే రాగ స్వరూపమే మారుతుంది.

విద్యార్థికి వైద్య కళాశాలలో ప్రవేశము లభిస్తే అతని భవిష్యత్తంతా మారవచ్చును. లభించకపోతే ఇంకొక దిశలో ప్రవహించవచ్చును. పెండ్లినుండి, వృత్తినుండి దేశ విదేశ నివాసముల వరకు మారవచ్చును. ఎన్నికలలో ఒక్కొక్క గెలుపు లేక ఓటమి బ్రతుకు పడవనే తలక్రిందులు చేయవచ్చును. అక్క చెల్లెండ్ల వివాహ పరిస్థితులు, వారి భవితవ్యాలనే వేరు వేరు పాయలుగ చీల్చి వేయవచ్చును. భర్తలు భిన్న స్వభావాలవారు కావచ్చును. ఆరోగ్య వంతులు, అనారోగ్య పరులు లాభాలు

గడించేవారు, నష్టాలు పడేవారు, ఆదరముతో చూచుకొనేవారు, ఉపేక్షించేవారు, కోప స్వభావులు, శాంతపరులు, భార్యల అభిరుచులు గుర్తించి, సాయపడువారు, అవహేళనచేసి నిరుత్సాహపరచువారు, మెచ్చేవారు, అనుమానించే వారు కావచ్చును. అనుకూలమైన సంతానము కలవారు, ఇబ్బందుల కలిగించువారు కావచ్చును సంతానము లేని వారే కావచ్చును.

అట్లనే ఉద్యోగములో ఉన్నవాడు, తప్పిదాలు చేసి తప్పించుకొన్నవాడు, పట్టుబడ్డ వాడు, వారి జీవిత మార్గాలే మారవచ్చును. ఆయుస్సు, ఆరోగ్యము, జీవన పంథాలు వేరు, వేరు దిశలకు లాగవచ్చును. అనూహ్యాలు భావి సోపానాలు. సోపానాలు అవే అయినా కొందరిని పైకి తీసికొనే మెట్లే కావచ్చును. కొందరిని క్రిందికి జార్చేవే కావచ్చును. కొందరి చావులు కొందరికి లాభించవచ్చును. వీలునామా వల్ల గాని, ఇన్సూరెన్సు వల్ల గాని ప్రమోషన్లవల్ల గాని కలిసి వచ్చేటప్పుడు, అన్నీ అనుకూల వాయువులే! లేనపుడు అన్నీ ఎదురు దెబ్బలే! బెడిసి కొడ్తాయి.

ముఖ్యముగా ఆడవారికి అంతా అనిశ్చయమే. అత్త మొదలు అంతా క్రొత్తవారే. క్రొత్త పరిసరాలు, క్రొత్త పరిస్థితులు. జీవన శాస్త్రానికి వ్యాఖ్యానాలు చేసేవారు లేరు. వారి వారి గాలి పటాలు ఏ దిక్కున, ఏ ఎత్తులో ఎగురునో ఊహించలేము.

నా జీవితములో చిన్న విషయాలే పెద్ద ఫలితాల నిచ్చాయి. పదమూడవ యేడులో కాంగ్రెసు పిలుపున సర్కారు బడి వదలకయుంటే, నా బ్రతుకు మట్టి ఏ రూపాన్ని తాల్చేదో! పిడత, కుండ కూజా, బాన ఏమైనా అయి యుండవచ్చు. విశ్వభారతి పోకుంటే, సత్యాగ్రహము చేయకుంటే, ఎన్నికలలో గెలువకుంటే, మంత్రిని కాకుంటే ఎట్లా మారిపొయ్యే వాడనో!

మా తమ్ముడి మాదిరి రైతుగా గ్రామీణ జీవితము గడిపే వాడినో, మా అన్నగారి మాదిరి ఆధ్యాత్మిక చింతనతో, ఏ అరవిందాశ్రమముననో చేరి జీవితము గడిపే వాడనో, లేక జారి క్రింద పడే వాడనో! ఇంతవరకు అంతా మంచికే జరిగిందని తలుస్తున్నాను. అసంతృప్తులు, పశ్చాత్తాపాలు లేవనే చెప్పాలి.

ఆధ్యాత్మిక చింతన లేకపోయినా, ధర్మ చింతన కొద్దిగ ఉన్నదేమో! నృత్య సంగీతాది కళలలో కొంత అభిరుచి ఉన్నది. అనుకోని ఆయుస్సు, ఆరోగ్యము శోచనీయముగ లేదు. ఈ నాటికి నాకు తెలిసి మా ఇంట్లో మగవారు ఎవరూ 60 సంవత్సరాల పండుగ చేసికోలేదు. 51 సంవత్సరాలు మించకుండానే వెడలిపోయే వారని ప్రతీతి!

గాలిబ్ అన్నట్లు-

"చేసిన పుణ్యాలు కొన్ని
చేయని పాపాలు చాలా
అందులకే సంతోషము, సంతుష్టి!"

4-5-87,

నెల్లూరు

# 26. పాపాలు

పాపాలు మానవుల ప్రత్యేకతా?

జంతువులు, పక్షులు కూడ పాపాలు చేస్తాయా?

తెలిసి చేస్తే గదా పాపము అంటారు కొందరు. మానవుడు పుట్టిన తర్వాత పాపము మొదలైనదా? లేక మానవుడితో కూడా సహజీవనము చేస్తున్నదా? పాపాల భావాలు, వ్యాఖ్యానాలు, అర్థాలు దేశ కాల స్థితులను బట్టి మారుచుండును· మాంసము తిన కూడదు. ఒక కాలములో ఒక సంఘానికి తప్పు. అదే కాలములో యింకొక సంఘానికి తప్పు కాదు. త్రాగుడు తప్పు. కొన్ని దేశాలలో, మరికొన్ని దేశాలలో కాదు, ఎన్ని రకాల పాపాలు! నిర్వచనాలు మారుచునే వస్తున్నాయి. ఏమైనా పాపాలు చేసేది చేయనిది మానవుడే!

సంకల్పించిన పాపాల నన్నిటినీ చేయడు, చేయలేడు-మానవుడు. అందువల్లనే సమాజము సమాళించుకొని వస్తున్నది. కొంత సంస్కృతి, నీతి, సంఘ భీతి ప్రభుత్వ నీతి అదుపులో పెట్టుకొనే యున్నది. పోలీసు కోర్టులు పాపము చేయకుండ చూడ డానికి, చేస్తే శిక్షించడానికి!

ఎంతెంత ద్రవ్యం వెచ్చించుచున్నాము- పాపాన్ని అదుపులో పెట్టి, హద్దులమీరి దొర్లిపోకుండ పెట్టడానికి! మనిషిని చంపడం

పాపం, యుద్ధములో చంపడం పుణ్యం- శూరత్వం! ఎన్ని పుట్టల్లో, సురంగాలలో దాగి ఉంటాయి- పాప సర్పాలు! ఎన్ని రంగులు, ఆకారాలు చిత్ర విచిత్రములైన సర్పాలు!

నీచ బుద్ధిచేత, స్వార్థముచేత, ఆశచేత, కామముచేత చేసేవి ఎక్కువ పాపాలు. విరోధులు పన్నే కుట్రలను ఎదుర్కొనడానికి చేసే పాపాలు కొన్ని. స్నేహితుల కొరకు, స్నేహితుల చేత చేయించే పాపాలు కొన్ని. ప్రయాణీకులకు 'దొంగలున్నారు, జాగ్రత్త' అనే హెచ్చరిక యైతే, పదవులలో నున్న వారికి "విమర్శకులు, పత్రికలు, స్నేహితులు ఉన్నారు. జాగ్రత్త" అని తట్టి హెచ్చరిస్తూ ఉండాలి. లంచాల తీగ పెరిగేది స్నేహితుల పాదులోనే! పొగడి ప్రియమైన మాటలతో అక్రమ పనులను చేయించేది స్నేహితులే! స్నేహితు లంటే అందరూ అని అర్థము కాదు. కొందరు నిపుణులు, కార్యశూరులు, తెలుగులో చెప్పాలంటే దేవాంతకులు!

చిన్నదానికి పెద్దదానికి, తగినదానికి తగనిదానికి సిఫారసు చేయమంటారు. చేయరాని పనిని నీ ద్వారా చేయించాలని చూస్తారు. తప్పుచేసిన వానిని తప్పించ మంటారు. ఉద్యోగాలకు, పై ఉద్యోగాలకు సిఫారసు చేయమంటారు. నీవు జాలిగొని లోబడడానికి ప్రారంభిస్తే, ఎంతవరకు ముక్కుతాడు వేసి తీసు కొని పోతారో లెక్కలేదు. నీకు చెడ్డ పేరురాదని వారి నమ్మకము. ఎవరికి తెలియకుండా జరుగవలసిన పని కదా! నీకు చెడ్డపేరు వస్తే మాత్రం వాళ్ళ కేమి? వాళ్ళ పని నెరవేరాలి. అందరూ చేసేదే నీవూ చేశావు. కొందరు పట్టుబడుతారు. చాల మంది పట్టుబడరు. నీ ఉద్యోగము పోయినా, రెండు నాళ్ళే వారికి చింత. పదిమంది చేసేది నీవూ చేస్తే తప్పు కాదనే వారి

వ్యాఖ్యానం : వారి స్వార్థం ఎంతకైనా లాగుతుంది. 'కోరింది కావాలె' అనేదే వారి లక్ష్యం. పొగడ్తల వెన్న చేతనైతే చాల చౌక బేరం. లేకుంటే యితర సాధనాలు వినియోగిస్తారు.

రక్షకులు హంతకులైతే ఎట్లా? శల్య సారథ్యాలు, శకుని జూదాలు దగ్గరవారు ఆడితే ఎట్లా? దగ్గరవారే నీ నైతిక పతనానికి సోపానాలు కట్టుతారు. అవినీతి తత్త్వాలకు పరుపులు పరుస్తారు. కమ్మని మాటల కందెన వేసి వారి బరువు బండిని నీ చేత లాగిస్తారు. పాపాలు తలపై ఎగురుతున్న ఆకాశములో దగ్గరవారి అంతస్థు తక్కువది కాదు. రణరంగములో శత్రువులను, పదవీ మంటపాలలో చుట్టాలను, స్నేహితులను దూరముగ ఉంచుటే శ్రేయము!

25-5-87,

నెల్లూరు.

# 27. పదేళ్ల సాహిత్య కృషి

**నా** సొంత రచనలను ప్రారంభించి పదేళ్ళు పూర్తి యైనాయి. 24–5–77 నా తొలి కవిత తాజ్‌మహల్‌ను పూర్తి చేశాను. నా జీవిత ప్రయాణములో ప్రధానమైన దినమే నా తొలి కారాగార శిక్ష 26-5-1930న. నా తొలి మంత్రిత్వ దినము 14–7-1937. నా జీవిత పథములో ఇవి కొన్ని గుర్తుకు వచ్చే మైలు రాళ్ళే గదా! కారాగార శిక్షలు, పదవీ ఔన్నత్యాల కన్నా నా సాహిత్య కృషి ప్రథమ యత్నము ఉత్సాహము నిచ్చేదే. సాహిత్య వనానికి వసంత కోకిల వచ్చినట్లే గదా! అణగియుండిన భావ ముకుళికలు కవితా ప్రసూనములుగ వికసించిన దినము. తెలుగు తెలిసిన ఎవడైనా, ఎక్కడున్నా చదువవచ్చు. ఇళ్ళల్లో కాకపోయినా, ఏ యూనివర్సిటీ లైబ్రరీలోనో, ఏ జిల్లా గ్రంథాలయాలలో నైనా ఉండవచ్చు. ఇరవై యేళ్ళ తర్వాత ఎవడో ఒకడు ఏదో కుతూహలముతో పుటలు త్రిప్పవచ్చు. ఏదైన ఆసక్తి కలిగిస్తే పుస్తకమంతా చదువవచ్చు. పెక్కుమంది ఉపేక్ష వహించినా, కొద్ది మందికి అపేక్షో, శ్రద్ధో కలిగించవచ్చు.

భవభూతి మాటల్లో సమాన ధర్మ హృదయుడు భాషను పరీక్షించుటకో, భావాన్ని పరిశీలించుటకో, అలంకారాలు గమనించుటకో చదువవచ్చును. చదువకనూ పోవచ్చును. విస్మృతి భస్మము

కప్పివేయ వచ్చును. కాల నిష్ఠుర హస్తము పాతివేయవచ్చును. అది భవిష్యత్తు చీకట్లకు వదలి వేస్తాము.

నా మట్టుకు నాకు నేను జీవించి యున్నాను. కాబట్టి కొన్ని కొన్ని ఉదంతాలను స్మరణకు తెచ్చే తేదీలు ముఖ్యమైనవే. ఇతరులకు కాకపోచ్చును. చరిత్రకు తెలియక పోవచ్చును. కాళిదాసు సమర్థించు కొన్నట్లు క్రొత్తది కాబట్టి ఎవరి కుతూహలమునో రేపవచ్చును. హృదయలతల పల్లవింప చేయవచ్చును. వేరులు దిగక, మొక్క ఎండిపోవచ్చును. పాతదంతా బ్రతికే లేదు. క్రొత్తదంతా చావనూ లేదు. యుగాలు ఉపేక్షా ప్రభంజనాలకు కూలిపోవచ్చును. తలయొగ్గి మరల తలలు ఎత్తవచ్చును. ఒక కాలములో ప్రచారమునకు వచ్చినది అన్ని కాలములలో వ్యాప్తిలో ఉంటుం దని ఏమి నమ్మకము? కొన్నింటికి తొలుత వ్యాప్తి లేకపోయినా, క్రమేణ ఎక్కువ ప్రచారమును పొంద వచ్చును. త్యాగయ్య హయాములో లేని వ్యాప్తి నేడు వచ్చుచున్నది, పెరుగుచున్నది-వాని కృతులకు! సినిమాల పాటలకు పరిమిత కాలములోనే ప్రచారము. పత్రికా సాహిత్యము స్వల్పాయుస్సుతోనే పుట్టుతుంది. కాలానికి ఎదురీదే సాహిత్యము చాలకొద్దే! అదే మన మూల సంపద కావచ్చును. ప్రచురింపబడ్డ ప్రతి పుస్తకము మూల సంపదలో చేరదు. మూల చేరి మాయ మయ్యేవి చాలా! పదవీ విరమణ చేసిన అధికారుల మాదిరి కొన్నాళ్ళు పెన్షన్ వస్తుంది. తర్వాత పోతుంది.

ఒక గ్రంథకర్త సాహిత్యము కొన్ని దశాబ్దాలో శతాబ్దాలో బ్రతికియున్నా, అతని సమగ్ర సాహిత్యము ఉండకపోవచ్చు. నిగ్గు తేలి నిలిచేది కొద్దే! నెయ్యి నిలుస్తుంది. మజ్జిగ పులిసిపోతుంది. చెట్టు మొదలు ఉంటుంది. ఆకులు, పువ్వులు రాలిపోతాయి. కాళి

దాసు మాళవికాగ్నిమిత్రానికి అభిజ్ఞాన శాకుంతలానికి వచ్చినంత ప్రసిద్ధి రాలేదు గదా! భవభూతి మహావీర చరిత్రకు ఉత్తరరామ చరిత్రకు వచ్చిన పేరు రాలేదుగదా? కాల పరీక్షా మంటపాలలో ఏది చీకట్ల దొంతరలను చీల్చి, కిరణమై కాంతి పుంజాలను దానము చేస్తుందో, ఏది మూల కుప్పలలో కూరుకపోతుందో ఏ నాడీ గ్రంథమూ చెప్పలేదు. కాల పరీక్షలలో దయా దాక్షిణ్యాలు లేవు. తీరిక నిదానాలు లేవు. వర్తమాన ప్రచారాలు ముందుకాలాల నిర్ణయాల శిల్పములను మలచలేవు. నేటి ఉత్తరువులకు నాటి చెలామణి లేకపోవచ్చును. వర్తమాన వర్ష వాగ్దానాలు, ఆగామి కాలాల ఎండమావులే కావచ్చును.

అల్లసాని పెద్దన్న మనుచరిత్రనే ఉదాహరణముగ తీసి కొంటాము. అతను ఇంకేమీ వ్రాయలేదా ? అవి ఏవి ? కాల లుప్తములై ఎప్పుడో ఎక్కడో మాయమైనాయి. మనుచరిత్రలో ఎన్ని పద్యాలు జనుల నాలుకల మీద గజ్జె కట్టి ఆడుచున్నవి? ఎన్ని ఆడలేక చతికిల పడినాయి. ఎన్ని మరుగున చెట్టు నీడల క్రింద శయనించు చున్నాయి? పెద్దన్న వ్రాసిన దంతా బ్రతికి లేదు. ఛందస్సులో ఉన్నంత మాత్రాన బ్రతికి ఉండడము లేదు. విచిత్రము కాలపు తీర్పు. మంచి ముందుమాటలతో, స్తుతిపరమైన సమీక్షలతో పుస్తకము ముస్తాబై వచ్చినా, ఎక్కువ ఆనందోత్సాహముల పొంద నక్కరలేదు. ఆడంబర రాహిత్య మున వచ్చినా నిరుత్సాహము పడనక్కర లేదు. కవి వాని మనో ధర్మము ప్రకారము వ్రాస్తాడు. నీతి నిజాయితులతో వ్రాస్తాడు. కాలపు తీర్పు ఏమైనా కానీ !

31-5-87,

నెల్లూరు.

# 28. నేను ఎదుగవద్దా ?

నా దశాబ్ద సాహిత్య కృషికి నా హితైషులు శుభా కాంక్షలు పంపిస్తూ, ఇంకొక పదేళ్ళ పాటు ఈ కృషిని సాగించి, ఇంకా కొన్ని గ్రంథాలను సాహిత్య లోకానికి యివ్వవలె నని కోరారు. వారి ఆశీస్సుల అక్షింతలు నిండు హృదయముతో వేసి నవే. సందియము లేదు. కాని నన్ను సంతోష పెట్టలేదు. వర ప్రసాదముగ నేను భావించలేదు. కర్తవ్యపు కాడెను మెడమీద నుండి తొలగించక, పని చేయా లనే కోరారని తలచాను.

చెరకు గడలో గణుపు లున్నాయి. నా జీవితములోను అట్టి గణుపులను గమనిస్తున్నాను. ఒక అంతస్తునుండి మరొక అంతస్తుకు పోవాలె. అదే పెరుగుదల అని భావించాను. నాకు వారసత్వముగ ప్రాప్తించినది వ్యవసాయము. నేను దానిని స్వీకరించక, స్వాతంత్ర్య సమరములోనికి దూకాను. పదే పదే జైలు శిక్షలు అనుభవించాను. ఎన్నికల పోటీలకు దిగవలసి వచ్చింది. పెద్ద పోటీలనే ఎదుర్కొనవలసి వచ్చింది. అనింద్య వయస్సులోనే మంత్రి నయ్యాను. మంత్రినై మరల ఖైదీ అయి నాను. 1943 డిసెంబరులో తంజావూరు జైలునుండి తుది సారిగా బయటకు వచ్చాను. 1947లో రెండవ తూరి మద్రాసులో మంత్రిగ పదవిని స్వీకరించాను. మద్రాసులో 26 మాసాల

ఏకాగ్రత కావలెను. మానసిక అనుశాసనము అక్షరాల యోగాస నములో కూర్చొనుట, పదాల ప్రాణాయామము చేయుట! ఈ కుదింపుల వదలి, భాషా సూత్రాలను వదలి, ఉన్ముక్త వాతా వరణములో స్వేచ్ఛను అనుభవించే దెప్పుడు? నా విరామ ముతో, నా ఏకాంతముతో విహరించే దెప్పుడు? భావాలను గాలి పటాల వలె వదలి, వాయు తరంగములపై వాని నృత్య పరి భ్రమణల తిలకించే దెప్పుడు? అనంత ఆకాశాన్ని, రమ్యమైన పృథ్వీని చూచుటకు నోచుకొన లేదా? శ్రావ్య సంగీతాన్ని వింటూ, సప్త స్వరాలను పలుకరించే దెప్పుడు? మాటల వలను విడనాడి, స్వరాల తంబూరాను చేపట్ట కూడదా?

వయస్సు నీడలు పొడు గగుచున్నవి. దేహ శకటాన్ని ఈడ్చుకొంటూ వచ్చిన నేను రోడ్డు ప్రక్క, కాలువ గట్టున బండిని నిలిపి చెట్టుమీద కిలకిల లాడే పిట్టలనో, నీళ్ళలో నిశ్శబ్ది ముగ ఇటు నటు తిరిగే చేపలనో చూస్తూ ఆగకూడదా? టి.వి. సౌందర్యాలను, రేడియో శ్రావ్యతలను, క్యాసెట్ల మధురిమలను ఇంకెప్పుడు అనుభవించాలె? గుడి గంటలు ముగిసే లోపల స్వేచ్ఛగ ఆనంద రసాన్ని గుటకలుగా త్రాగే దెప్పుడు?

కోరిక తొడిమలను త్రుంచి, ఆకులను మొగ్గలను రాల్చు కొని, మోడుగ నిలిచి ఎండను వానను, వెన్నెలను మంచును వక్షమునకు అదుముకో కూడదా? ఆకుల చీకట్లలోనే ఉండా లనా? పైకప్పులు వదలి మనస్సును రాజ సన్న్యాసిని చేసి అనంతమును అవగాహన చేసికొనేది నొసట వ్రాయలేదా? విశృంఖలమైన స్వేచ్ఛను కోరుచున్నది డెందము. సప్త స్వరాల మీద ఎగరాలని కుతూహలము! కంచుకము కవచము విడనాడి 'ఏక్‌లా చలో రే' అంటూ, ఆనంద భైరవి రాగము తీస్తూ, నిరు ద్దేశ యాత్రికుడిని కాకూడదా?

ఎప్పుడూ కర్తవ్య మనే వలయములోనే తగుల్కొని తిరుగుచుండా లని ఏ దూర్వాసుని శాపము ?

'శాంతి నిమ్ము', 'స్వేచ్ఛ నిమ్ము'. 'ఆనందము నిమ్ము' అనేదే నా సాధన. నా హితైషులు ఆలోచించి చెప్పాలనే కోరుచున్నాను.

31-5-87,

**నెల్లూరు.**

# 29. దుగ్గిశెట్టి వేంకట రమణయ్య

"1973వ సంవత్సరంలో రమణీయ రామాయణము ఆంధ్రుల కిచ్చారు. అభిమానులు, పండితులు మెచ్చారు. హర్షించారు. తర్వాత ఏమైనా వ్రాస్తున్నారా, ప్రకటించలేదే" అని అప్పుడప్పుడు అడిగే వాడిని. "ఏదో వ్రాస్తున్నా, ఎప్పుడైనా పత్రికలలో పడుతున్న" వనేవాడు. వసంత కోకిల మూగ బోయిందా! అనే సందేహము నన్ను వెంటాడుచునే యున్నది. ఆయన నిగర్వి. మాటలు తక్కువ. తన శక్తి మృదంగాలను తాను వాయించడు. ఉదాత్త చరిత్రుడు. వృత్తిలో నిమగ్నుడు కాబోలు అని తలచేవాడిని.

1987వ సంవత్సరంలో ఐదు పుస్తకాలు ఒకే సారి వెలువరించారు:

1. సతీ స్మృతి
2. ఆదిలక్ష్మి (ఇంగ్లీషులో)
3. మబ్బు కబ్బము (మేఘదూత అనువాదము)
4. కల్హార మాల
5. భావ వీచికలు (నవీన శైలిలో)

అప్పు డనుకొన్నాను. కోకిల మూగపోలేదు. మెదడు తన ఏకాంతమును కవితా శిల్పములతో మలుస్తున్నది. కళా శిల్పము

తోడనే వికసించేది కాదు. తీరికగ మధ్యాహ్నము సాయంత్ర మైనటుల వికసించేది. ఛాయలు మందముగ దీర్ఘము లయ్యేవి.

మధ్యలో పత్నీ వియోగము. క్రొత్త పరిస్థితులకు అల వాటు పడాలి. తీరిక వేళలలో కలిగే విచారానికి తెప్పరిల్లుకొని, దుఃఖ శిలను శిల్పముగ మలచుకొనుటకు సమయము కావాలి. తిమిర పుంజాలు పలచబడి వెలుగులు చిమ్ముటకు సమయము రావాలి. అమావాస్య పౌర్ణమి యగుటకు వ్యవధి ఉండాలి. పగులు మబ్బులు బొట్టు బొట్టుగ పద్యములలోనికి ఇంకి, తోట మట్టిమీద వాలడానికి, ఎన్నో రూపాంతరాల పొందాలి. వ్యస నము సాంత్వన మగుటకు శుభ తరుణము రావాలి. చితాగ్నులు హోమాగ్ను లగుటకు మంచి ముహూర్తము కుదురాలి!

అదృష్టముగ నుండిన సతి, అదృశ్యమై స్మృతి యైనది. స్పర్శకు పులకించే సతి, స్పర్శ పరిధుల దాటి, మనకల స్మృతి యైనది సతికి ఆయుస్సు పూర్తికాగా, వెడలి పోయింది. స్మృతికి కూడ ఆయస్సు పరిమితమే! క్రమేణ క్రమేణ విస్మృతి పర్దా వెనుక మాయము కాగలదు. అన్ని మార్పుల నేర్పరి కాల మాంత్రికుడు. స్మృతి విస్మృతిలోనికి దిగజారకుండా ఆపే అన కట్ట శిల్పము. అందులకే రమణయ్య స్మృతియైన సతిని కావ్య సుందరిగా దిద్దారు. ఇక ఆమె సాహిత్య లోకమునకు చెందినది. వ్యక్తిగత మైన స్మృతి కాదు.

అది లక్ష్మమ్మ సతియై, స్మృతియై, కావ్య సంపద యైనది. వ్యక్తిగత శోకము సాహిత్య సుందరి యైనది. పుటము చేయబడిన బంగా రైనది.

4-6-1987,

నెల్లూరు.

# 30. విపరీతాల వింత !

1. రైతు కుటుంబములో పుట్టాను-
   వ్యవసాయ విషయము తెలియదు.

2. ఇంటి పేరు బెజవాడ-
   బెజవాడతో ఏ సంబంధమూ లేదు.
   ఎందుకు వచ్చిందో తెలియదు.
   ఒక సెంటు భూమి కూడ అక్కడ లేదు.

3. పేరు గోపాలరెడ్డి.
   మద్రాసులో, కర్నూల్, ఢిల్లీలలో
   ధనపాలుడు (Finance Minister) గ,
   ఉత్తరప్రదేశ్‌లో రాజ్యపాలుడుగ ఉండినాను.
   ఎన్నడూ గోవుల మేపలేదు.

4. తల్లి తండ్రులు మాంసాహారులు.
   5 వ సంవత్సరమునుండి నేను శాకాహారినే !
   బెంగాల్‌లో కొన్ని పరీక్షల ఎదుర్కొన్నాను.
   లొంగక శాకాహారిగానే నిలిచాను.

5. వెట్ పార్టీలకు చాలావాటికి పోయినాను.
   ఎన్నడూ మద్యము ముట్టుకోలేదు.

13. శాసన సభలలో పార్లమెంటులో దాదాపు పాతిక సంవత్స
రాలు సభ్యునిగా ఉండినాను.
ఒక్కసారి కూడ స్పీకరు స్థానములో కూర్చోలేదు.
—గవర్నరుగా తప్ప.

14. ఫోర్త్ ఫారమ్ చదువుతూ కాంగ్రెసు పిలుపున సర్కారు
బడిని వదలితిని, 1921 జనవరిలో. ఏ యూనివర్సిటీ
లోను చదువ లేదు.
మూడు యూనివర్సిటీలకు ప్రోఛాన్సలర్, తొమ్మిది
యూనివర్సిటీలకు ఛాన్సలర్ అయినాను. విద్యామంత్రి
నైనాను.

15. భారతీయ భాషలు చాలా నేర్వడానికి ప్రయత్నించాను.
బెంగాలీ, ఉర్దూ, గుజరాతీలనుండీ అనువాదాలు చేశాను.
ఏ భాషలో కూడ పాండిత్య మున్నదని చెప్పుకోలేను.

16. తెలుగు వాడిని, తెలుగులోనే వ్రాస్తాను.
అభిమానము మాత్రము సంస్కృతముమీద, ఇంగ్లీషు
మీద, కొంత ఉర్దూమీద!

17. కవితలు వ్రాస్తాను. కొందరు నన్ను కవి అని అంటారు.
ఛందస్సు మాత్రము బొత్తిగా తెలియదు.
అప్పకవి అంటే మంట!

18. చాలా ఇస్లాం దేశాలను చూచాను.
ఆఫ్ఘనిస్థాన్, ఇరాన్, మలయా, ఇండోనేషియా,
ఈజిప్టు, జోర్డాన్, సిరియా, లెబనాన్.
మక్కా, మదీనాల దేశాలను చూడలేక పోయాను.

19. గౌతమ బుద్ధ, జీసస్ క్రైస్టు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు

పుట్టిన స్థలాలను దర్శించాను.

మహావీర, మహమ్మద్, నానక్ జన్మస్థలాలను చూడలేదు.

20. 1920వ సంవత్సరం నుండి గాంధి మార్గమునే అవలంబింప యత్నించుచున్నాను. సబర్మతి, సేవాగ్రామములను చూచాను.

గాంధి జన్మస్థలాన్ని పోర్‌బందరును చూడలేదు. ఈ ఏడాది ఆయన జన్మదినమున, ఆయన జన్మ స్థానమును చూడ యత్నించుచున్నాను.

21. శాంతి నికేతన్‌లో, కలకత్తాలో, ఢిల్లీలో మణిపురి నృత్యాలను చాలా చూచాను.

మణిపురి మాత్రము చూడలేక పోయాను.

22. పారిస్, బెర్లిన్, రోమ్‌లను చూచాను.

లండన్ చూడలేదు.

23. యమున, బృందావనం. కృష్ణుడు, గోపికలు శృంగారానికి సంకేతాలు!

యమునోత్రిని చూడలేకపోయాను. గంగోత్రిని చూచాను.

30_7-87,

నెల్లూరు.

# 32. రాగ సుధ

గత శతాబ్దాలలోని ఎందరు మహనీయుల కృషి ఫలితాలకు వారసులము మనము ! వారు కష్టించి, సంపాదించి యిచ్చి పోయిన సంపద లవి. తీర్చ వలసిన రుణాలు కావు. వినియోగించి అధికము చేయవలసిన ఐశ్వర్యాలు! మూలధనమును ఉన్నది ఉన్నట్లుగానే ఉంచితే, మన కృషి, మన ప్రజ్ఞా ఏమైనట్లు? సాహిత్యము, వైద్యము, వేదాంతాల విషయాలను వదలి, సంగీత రంగంలో, శిల్ప శాఖలో ఎన్ని అపూర్వ సౌందర్యాలను సృష్టించి పోయారు? రాళ్ళను చెక్కి ఎట్టి కళాఖండాలను, శతాబ్దాలుగా తన్మయ పరిచే అమర మూర్తులను ఇచ్చి పోయారు? లోహాలను కరగించి, మూసలలో పోసి లోహ విగ్రహాలను వదలి వెళ్లారు ! సంగీతములో స్వల్పపరిధిలో, అనంత రస పారావారాన్ని కల్పించినారు. సాహిత్యములో 56 అక్షరాలు, సంయుక్తాక్షరములను కలిపితే, ఎన్నో అక్షరాలు! వానికి జీవము పోసి, హృదయ స్పందన కలిగేటటుల పలికించి కావ్యా లనబడు ధనరాసులు మనకు ఇచ్చారు. సంగీతములో ఏడు స్వరాలు, 'సరిగమపదని'. 'స', 'ప'లకు మార్పు లేదని, 'మ'ను రెండుగా విభజించి, 'రి,గ,ద,ని'లను మూడుగా భేదించి మొత్తము 16 చేసికొని, ఆ పరిధిలోనే రస మాధుర్యాన్ని వెదజల్లి పోయారు. కొద్ది మార్పుల వ్యత్యాసాలతో 72 మేళకర్త రాగాలను ఆరోహణ

అవరోహణములలో మార్పులు కల్పించి, అసంఖ్యాకములుగా జన్య రాగాలను పుట్టించినారు. నాకు ఎరుకైనంత వరకు మరి ఏ ఇతర దేశములోను యింతటి వర్గీకరణ, స్థిరీకరణ చేసినటుల కానరాదు. ముఖ్యముగ కర్ణాటక సంగీతములో ఈ శాస్త్రము స్థిరపడి ప్రచారము పొందింది. హిందూస్థాన సంగీతములో కొంత తక్కువనే చెప్పాలి. ఎంత దీక్ష, ఎంత సాధన, రస సంపత్తికి వారసులము మనము! పిత్రార్జిత మగు ఆస్తి పాస్తులు పెద్దవే. విస్తృతములే, మధురములే!

మన సంగీతము సామ వేదమునుండి ఉత్పన్నమైన దంటే తృప్తి, ఆనందము! ఏమి ఎట్లా సంబంధమో నాకు తెలియదు. బాదరాయణ సంబంధ మేమో! సర్వము మన వేదాలలో ఉన్నవి అంటే, అతి ప్రాచీనత, పవిత్రత అంటగట్టి మన పూర్వీకుల ప్రజ్ఞను ప్రస్తుతిస్తారు. అవి దైవ వాక్కులని విశ్వసిస్తారు. సామవేదము ముందు పాటలు, దరువులు లేవా? పెద్ద శాస్త్రముగా లేకపోవచ్చు. ఆడవాళ్ళు దంచుకొనేటప్పుడు రాట్నాలు త్రిప్పేటప్పుడు రైతులు దున్నుకొనేటప్పుడు, వీరులు యుద్ధాలకు వెళ్ళేటప్పుడు, పెండ్లి పేరంటాలకు, సంతానము కలిగినప్పుడు, పడవలు నడిపేటప్పుడు ఆ యా జిల్లాలలో తగిన పాటలు లేవా? వృత్తి వృత్తికి పాట లున్నాయి. వేళ వేళకూ పాట లున్నాయి. కోయవాళ్ళకు, చెంచులకు పాట లున్నాయి. చిన్నతనములో పల్లెల్లో ఏనాది పాటలు, దరువులు వినేవాళ్ళము. వీరి భాగవతాలు, సంక్రాంతి పాటలు, బుడబుక్కల వారి పాటలు, గంగిరెద్దు పాటలు, ఎరుకల పాటలు ఇవన్నీ ఏమైనాయి? ఇవన్నీ ప్రసిద్ధికి రాని పల్లెల పాటలు. జానపద సాహిత్యము వలెనే జానపద సంగీతము అంత ప్రాచీన మైనది. భిన్న

స్వరాలు, తాళాలు అంతర్లీనమై యున్నాయి. పేరులేని, మరుగునపడి, ఖ్యాతికి రాని పల్లెల పాటలనుండే మన సంగీతము పుట్టినదని నా విశ్వాసము. మన సంగీత గంగకు గంగోత్రి సామవేద మనేదానికన్న, ఈపల్లె మహిళా వినోద సంగీత మనే నా నమ్మిక. ఈ దిశలో పరిశోధన చాలా జరుగవలసి యున్నది. అదే నేను కోరేది, విన్నవించేది!

నేను ఇంచుమించు భారత దేశ మంతా చూచాను. శాస్త్రీయ సంగీత మంటే మక్కువ తమిళులకూ, మహారాష్ట్రులకూ ఉన్నంత యితర ప్రాంతములలో తక్కువేమో; తర్వాత మైసూరు, అటు గ్వాలియర్, ఢిల్లీ వగైరాలు. తమిళ ప్రాంతమునుండి బయలు దేరితే ఉత్తర ప్రాంతానికి ఆంధ్రను దాటిపోవాలి, ఆంధ్రకు సింహపురి సింహద్వారము వంటిది. తమిళ ప్రభావము నెల్లూరు మీద కొంత ఉండనే ఉన్నది. పేరులోనే కాదు, ఆహార వ్యవహారాల్లో కూడా తమిళ ప్రభావము కాన్పిస్తూనే యున్నది. కోస్తా జిల్లాల ప్రభావము, రాయలసీమ యాస, మాటలు ఉన్నవి. వీటన్నిటి సమ్మేళనమే నెల్లూరు ప్రత్యేకత! శ్రీ ఇలపావులూరి కామేశ్వరరావు పదవిలో ఉన్నప్పటినుండి సంగీతముమీద శ్రద్ధనే చూపుచుండెను. పదవీ విరమణ తర్వాత కేంద్ర ప్రభుత్వ సాయముతో త్యాగరాజు కృతులమీద తన దృష్టిని కేంద్రీకరించాడు. సాహిత్య పరంగా, సంగీత పరంగా అది మన అదృష్టము. నేడు 'రాగ సుధ' పేరుతో ఒక అనురాగ మండలిని స్థాపించాడు. అభిమానులు సహకరించి అధ్యయన మొనర్చి, చర్చలుజరిపి, తృప్తి పొందుదురు గాక! చిన్నతనమునుండి మృదంగవాద్యమును నేర్చి సభలలో వాయించి తండ్రికి పెద్ద అండగా ఉన్నారు. వారి సంకల్పము, కృషి ఫలించు గాక!

మహమ్మద్ ప్రవక్త కడపటి వాడని ఖురాన్ షరీఫ్ చెప్పుతున్నది. ఆఖరుల్‌నబి అని విశ్వాసము. అట్టి విశ్వాసము లేనివారు ముస్లింలు కారని పాకిస్తాన్ చట్టము. కాని బహాయ్‌లు ఖాదియానీలు ఇంకా ప్రవక్తలు జన్మిస్తారు. జన్మించారు అంటారు. 'సంభవామి యుగే యుగే' అంటుంది భగవద్గీత. సద్గురు త్యాగ రాజు మన సంగీతానికి కిరీటము వంటివాడు, మేరు శిఖరము! 18 వ శతాబ్దపు భుజాలమీద 19, 19 భుజాలమీద 20 ఎక్కి కూర్చుని జావుటా ఎగురవేస్తున్నాయి. మరి 20 మీద 21 ఎక్కి విశ్వాన్ని వీక్షింపవద్దా? త్యాగరాజు కడపటి ప్రవక్త కాడు. ఇంకా ప్రవక్తలు రావచ్చు, రావాలె! 21వ శతాబ్దములో ఇంకా మన సంగీత ప్రసూనము ఎంత వికసిస్తుందో! త్యాగరాజును మించిన వాడు కసీసము సమానుడు పుట్టి, ఎట్టి అనూహ్యా సౌర భాలను వెదజల్లుతాడో, ఎందరు బాలమురళీకృష్ణులు రాగాలకు వన్నెలు దిద్దుతారో! ఎవరు ఊహింపగలరు? రానున్న శతాబ్ద శుక్తులలో ఎన్ని ముత్యాలు పండగలవో! మానవ వికాసములో విశ్వాస మున్నవాడిని అదే శ్రీ అరవిందుల ప్రబోధము. మూల ధనాన్ని అనుభవించే వారు చాలామంది. పెంచేవారు పుట్టాలి. నూతన తెన్నుల త్రొక్కే వారు కావాలి. జాడల ననుసరిస్తూ, నీడలలో విహరిస్తూ పోతే చాలదు. క్రొత్త దిగంతముల వైపు ముందుకు పోవాలి. చేరని రేవుల క్రొత్త తెరచాపలు ఎత్తాలి. అదే భవిష్యత్తు ఆహ్వానము. మరో శతాబ్దపు శంఖారావము!

స్త్రీ పాత్రలను స్త్రీలే వేయాలి అని నవీన యువకుల నమ్మకము. స్థానం సత్యభామ వేషం వేస్తే మా వాళ్ళు ఒప్పుకోరు. అట్లనే జావళీలు మన ప్రత్యేకత. శృంగార వియోగ రస భరి తాలు. కచేరీలలో జావళీలను స్త్రీలే పాడాలి. అట్లనే తిల్లానాలు

సొంపుగా ఉన్నా మృదు పదవిన్యాసములతో నృత్య ప్రదర్శన లలోనే రాణించేవి. రచించేది మగవాడైనా, అది చూపించేది ఆడవారుగనే ఉంటే మంచిది.

1-11-87,
నెల్లూరు.

# 32. రాజీవ్ గాంధి

నెల్లూరు కాంగ్రెసు శతాబ్ది భవనములో "నేను 1937వ సంవత్సరములో మంత్రి నైనానండి" అన్నాను– కాంగ్రెసు అధ్యక్షులగు రాజీవగాంధితో: విస్మయానందముతో మంద స్మితము చేస్తూ "ఏబది సంవత్సరాల క్రిందటనా ?" అన్నారు.

తల్లి ఇందిరా గాంధీకి వివాహము కాలేదు. తాత జవహర్ లాల్ నెహ్రూ కన్న తొమ్మిది సంవత్సరాల ముందే మంత్రి నైనాను.

(22-12-1987న ప్రధానమంత్రి, కాంగ్రెసు అధ్యక్షులు అగు శ్రీ రాజీవ గాంధి ఇందిరా కాంగ్రెసు శతాబ్ది భవనానికి ప్రారంభోత్సవము చేశారు.)

14-7-1937లో నేను మద్రాసులో స్థానిక పరిపాలన మంత్రి నైనాను.

2-9-1946న జవహర్ లాల్ నెహ్రూ కేంద్రములో Vice-chairmen, Viceroy's Executive Council గా నియమింప బడ్డారు. అదే 1947లో ప్రధానమంత్రి పదవి యైనది,

**2**

50 సంవత్సరాల మంత్రిత్వపు విషయము ఎంత మంది చెప్పగలరు ?

మురార్జీ దేశాయి (బొంబాయి),

విజయలక్ష్మి పండిత్ (ఉత్తరప్రదేశ్),

నిత్యానంద కానుంగో (ఒరిస్సా) (తర్వాత చని పోయారు), నేను తప్ప మరెవ్వరూ లేరు.

మొదటి ఇద్దరూ ప్రస్తుతము కాంగ్రెసులో లేరు.

కానుంగో అస్వస్థతతో ఇంటినుండి బయటకు రాలేరు.

నే నొక్కడనే సభలో చెప్ప గలిగినది. అనే సంతోష ముతో బయటకు వచ్చాను.

# 33. జఫర్ సమాధి వద్ద రాజీవ్

ఎంత దురదృష్టము! జఫర్‌ను
పూడ్చుటకు! రెండు గజముల నేల
దొరక లేదు— ప్రియా ప్రాంగణములో—జఫర్

రెండు గజముల నేల
దొరకలేదు హిందూస్థాన్‌లో,
కాని, నీ త్యాగముతో
మారు మ్రోగింది స్వాతంత్ర్య వాణి
దురదృష్టము నీది కాదు జఫర్ !
నీ పేరు భారతవర్ష ప్రతిష్ఠా వైభవములలో.
చేర్చబడినది, నీ స్వాతంత్ర్య సందేశముచే

— రాజీవ్ గాంధీ
16—12—1987
రంగూన్

అనువాదము:
19_12_87
నెల్లూరు.

(జఫర్ కడపటి మొగల్ చక్రవర్తి. ఆంగ్లేయులు బందీ చేసి రంగూనుకు తీసుక వెళ్ళారు. దాదాపు ముప్పది సంవత్సరాలు బ్రతికి అక్కడనే మరణించారు. వారి సమాధిని నేను రంగూన్‌లో 1951లో చూచాను. ఆయన కవి. కొన్ని గేయములు ప్రఖ్యాతిని పొందినాయి.)

మంత్రిత్వము. 1952 లో జరిగిన ఎన్నికలలో ఉదయగిరిలో ఓటమి; ఆంధ్ర రాష్ట్రము ఆవిర్భావము. ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షత. కర్నూలులో ముఖ్యమంత్రిగ, హైదరాబాదులో మంత్రిగ పని చేసి, 1958 ఏప్రెల్‌లో కేంద్రమంత్రి నైనాను. అప్పటికి వ్యవసాయము, జైలు శిక్షలు, రాష్ట్ర రాజకీయాలను వదలినాను.

నెహ్రూ మంత్రాంగములో మంత్రిని. ఢిల్లీ నివాసము. దేశ మంతా సంచారము సల్పి, దేశములోని వివిధ సంస్కృతులను గమనిస్తూ వచ్చాను. కలిపే సూత్రాలను అన్వేషిస్తూ వచ్చాను. అంటించే జిగురును కోరుతూ వచ్చాను. 66 మాసాలకు కామరాజు పథకము క్రింద రాజీనామా చేశాను. తర్వాత మంత్రిగా లేను. మరొక గణుపు. ఒకటి వదిలితే కాని, మరొకటి చిగిర్చదు. లాల్ బహదూర్ శాస్త్రి, ఇందిరా గాంధీ హయాములలో పార్లమెంటరీ కాంగ్రెసు పార్టీ డిప్యూటి లీడరును. 1967 మే నెలలో ఉత్తరప్రదేశ్ గవర్న రైనాను. అన్ని క్షేత్రాలను, అన్ని జిల్లాలను విస్తారముగ పర్యటించి, 1972 జూలైలో నెల్లూరు చేరినాను. ఆ తర్వాత రాజకీయాల ప్రసక్తే, కాని ఆసక్తి లేదు. పదవులు లేవు. ఒక మజిలీ వదలితేనే, ఇంకొక మజిలీ చేరగలము. బ్రతుకు చెరకు గడలో, ఇంకొక గణుపు చేరడ మంటే మారి, ఎదగడ మన్న మాటే!

హితైషుల ఆశీస్సుల ప్రకారం వ్రాస్తూనే ఉంటే, మార లేదనే అర్థం. వ్రాస్తే వ్రాయవచ్చును. రచనా దశాబ్దిలో కొన్ని లక్ష్యాలతో ఒక నిర్ణయ పరిధిలో ఉండినాను. ఒక నిష్ఠ ఒక సాహిత్య తపస్సు వంటిది. మనస్సును లగ్నము చేసి, భావ విహగాలను, పద పంజరములలోనికి దించి, బంధించ వలెను.

6. పార్టీలలో తేరకు వచ్చిన సిగిరెట్లను అప్పు డప్పుడు తాగేవాడిని.

ఒక్కసారి విద్యార్థిగ కొని తాగాను రైలులో.

1961 వ సంవత్సరం నుండి సిగరెట్టు పార్టీలలో కూడ ముట్టుకోలేదు.

7. బాల్ రూం డాన్సుపార్టీలకు చాలాసారులు హాజరైనాను.

ఒక్కసారి కూడా డాన్సు చేయలేదు.

8. చాలాసారులు జైలు శిక్ష అనుభవించాను. ఒకసారి నిర శన వ్రతము పూనాము ఆలీపూర్ జైలులో.

లాఠీచార్జీ దెబ్బలు ఎన్నడూ తినలేదు.

9. గుర్రపు పందెములకు చాలా సార్లు వెళ్ళినాను.

రంగూన్, కలకత్తా, బొంబాయి, లక్నోలతో సహా.

ఎన్నడూ ఒక పైస కూడ పందెములో ఒడ్డలేదు.

10. దాదాపు 16 సంవత్సరాలు కేంద్ర, రాష్ట్ర మంత్రిగా ఉన్నాను.

మంత్ర తంత్రములు చేతిలో లేవు. చొక్కా చేతుల లోను లేవు.

11. మద్రాసులో ఆర్థికమంత్రితో పాటు, ట్రాన్స్‌పోర్టు మంత్రిగ నాలుగేళ్ళు వ్యవహరించాను.

ఈ నాటికి మోటారు డ్రైవింగ్ చేతకాదు.

12. కేంద్రములో ఫిలిమ్స్ మీద మంత్రినై, మద్రాసు, బొంబాయి, కలకత్తాలలో అందరు నటులతోనూ, నటీ మణులతోనూ పరిచయము చేసికొన్నాను.

ఒక్క ఫిల్ములోనైనా నటించే అవకాశము రాలేదు.